


పిల్లలు డబ్బు దాచుకొనే యూకోబ్యాంక్ పథకాలు.














డిపాజిట్ సర్టిఫికేట్ కొంటే డబ్బు 7 నం॥ల్లో రెండింతలవుతుంది.




ఇంకావుంది

వెదజల్లబడుతోన్న మాధుర్యం
65 సంవత్సరాలకు పైగా ఆనందం







PRS/2767/TEL

# చందమామ

ఈ సంచికలో కథలు-వింతలు-విశేషాలు



ఇవిగాక అమరవాణి, కథాశీర్షిక పోటీ, ఫోటో వ్యాఖ్యలూ వగైరా.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 2 & 3, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor: NAGI REDDI. CHANDAMAMA is published monthly and distributed in U.S.A. by Chandamama Distributors, ... Subscription 1 year $ 6-50. Second Class Postage paid at West Chester, PA.

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

---

ఈ నెల బేతాళకథ [ "వారధి" ] యు. గౌరీ శంకర్ రచన.

వారధులు నిర్మించటం పురోగమనానికి లక్షణం, వాటిని పడగొట్టటం వివేక హీనతను సూచిస్తుంది. ఒకసారి పడగొట్టిన వారధిని తిరిగి నిర్మించటం అంత తేలిక కాదు. మంచి సంప్రదాయాలకన్న చెడు సంప్రదాయాలు ఎక్కువ కాలం కొనసాగుతాయి. అందుచేత మంచి సంప్రదాయాలకు విఘ్నం రాకుండా జాగ్రత్తపడాలి. మంచి సంప్రదాయాలకు ఊతంగా ఉండే భావాలు ప్రచారం కావాలంటే వారధులు చాలా అవసరం.

---

సంపుటి 61 అక్టోబర్ '77 సంచిక 4

విడి ప్రతి : 1-25 : : సంవత్సర చందా : 15-00




CHITRA




సంప్రాప్త మవమానం యః
తేజసా న ప్రమార్జతి,
క స్తస్య పురుషార్థో స్తి
పురుషస్యాల్పతేజసః. 1

[అవమానం కలిగినప్పుడు దాన్ని పౌరుషంతో పోగొట్టుకోని తేజోహీనుడికి ఎలాటి పురుషార్థమూ సిద్ధించదు.]

హీనం రతిగుణై స్సర్వై
రభిహంతార మాహవే,
త్యజంతి నృపతిం సైన్యాః
సంవిగ్నా స్తం నరేశ్వరం. 2

[అస్తమానమూ పీడించే రాజును యుద్ధంలో సైనికులు విసిగిపోయి త్యజిస్తారు.]

సర్వకాలసమృద్ధం హి
హస్త్యశ్వరథసంకులం,
పితృపైతామహం రాజ్యం
కస్య నావర్తయే న్మనః? 3

[చతురంగ బలాలు కలిగి, తండ్రి తాతల నుంచి సంక్రమించిన సుభిక్షమైన రాజ్యాన్ని చూస్తూ, చూస్తూ ఎవడు వదులుకుంటాడు?]

సూక్తులు



# కాకోలూకీయం

## 52

బ్రాహ్మడు మరికొంత దూరం వెళ్ళాక రెండో దొంగవెధవ కూలివాడి వేషంలో ఎదురుపడి, "ఛీ, ఛీ! ఈ చచ్చిన దూడ నీకు ఇష్టం అయి ఉండుగాక, అంత మాత్రాన దాన్ని భుజాల కెత్తుకుంటారా? క్షుద్రజంతువులనూ, శవాలనూ ముట్టుకున్నందుకు ప్రాయశ్చిత్తంగా పంచకవ్యాలు తినటమో, చాంద్రాయణవ్రతం చెయ్యటమో అవసరమని పెద్దలు చెబుతారు గద!" అన్నాడు.

"నీ కళ్ళేమన్నా పోయాయా? బతికున్న మేకను పట్టుకుని చచ్చిన దూడ అంటావేం?" అని బ్రాహ్మడు మండి పడ్డాడు.

"స్వామీ, కోపగించకండి. ఉన్నమాట అనే జబ్బు నా కున్నది. మీ ఇష్టం వచ్చినట్టు చెయ్యండి," అన్నాడు వాడు.

బ్రాహ్మడు మరికొంత దూరం వెళ్ళాక మూడో దొంగవెధవ గొర్రెలకాపరి వేషంలో ఎదురువచ్చి, "బ్రాహ్మడా, గాడిదను భుజాలమీద మోయటం ఏమైనా బాగుందా? గాడిదను తెలియక ముట్టుకున్నా కూడా సచేలస్నానం చెయ్యవలసినదే గదా! ఎవరన్నా చూసేలోపల దాన్ని అవతల పారెయ్యి," అన్నాడు.

అప్పుడు బ్రాహ్మడు తనలో, "ఈ మేక ఏదో రాక్షసి అయి ఉంటుంది. నన్ను మోసం చేసి, నాశనం చెయ్యటానికి ఈ రూపు ధరించి ఉంటుంది. రాక్షసి కాకపోతే ఒకరికి కుక్కలాగా, మరొకరికి చచ్చిన దూడలాగా, ఇంకొకరికి గాడిదలాగా కనబడుతుందా?" అనుకుని, ఆ మేకను అక్కడే పారేసి, కాలిసత్తువకొద్దీ తన ఊరికి పరిగెత్తాడు.

పంచతంత్రం



తరవాత ముగ్గురు దొంగవెధవలూ దాన్ని వండుకుని, కడుపారా తిన్నారు.

స్థిరజీవి మోసపోయిన బ్రాహ్మణుడి కథ చెప్పి ఇంకా ఇలా అన్నది :

"కొత్తగా వచ్చిన సేవకుడి శ్రద్ధా, భోజనానికి వచ్చిన అతిథుల ప్రశంసలూ, యువతి కన్నీళ్ళూ, మోసగాడి వాక్చాతుర్యమూ చూసి మోసపోనివాడు ఎక్కడైనా ఉంటాడా? గుడ్లగూబలు తప్పు చేస్తున్నాయి. వ్యక్తి బలహీనమైనా సంఖ్యాబలం ఉన్నచోట శత్రుత్వం తెచ్చుకోరాదు. ఈ కాకులకు సంఖ్యాబలం ఉన్నది. అందుచేత హెచ్చరికగా ఉండాలి. ఒక మహాసర్పం కోటి చీమలతో వైరం తెచ్చుకున్నది, సర్వనాశనమయి పోయింది కాదా?"

"ఏమిటా కథ?" అని మేఘవర్ణం అడిగింది.

స్థిరజీవి చీమల చేత చచ్చిన పాము కథ ఇలా చెప్పింది:

ఒకప్పుడు మహాకాయం అనే పెద్ద కాల సర్పం ఉండేది. అది తన మహాకాయాన్నీ, బలాన్నీ చూసుకుని గర్వపడుతూ, చాలా అహంభావంతో ఉండేది. ఒకరోజు అది పుట్ట నుంచి పెద్ద రంధ్రం కుండా బయటికి రావటానికి బదులు, తన శక్తిని నమ్ముకుని చిన్న రంధ్రం కుండా రావటానికి ప్రయత్నించి, మట్టి చాలా గట్టిగా ఉండటంచేత శరీరమంతా గాయ పరచుకున్నది. ఆ గాయాల నుంచి వచ్చే రక్తం వాసన తగిలి, ఉత్సాహంతో, వేలకొద్దీ కండచీమలు దాన్ని పట్టుకుని తినసాగాయి. పాము అనేక వందల చీమలను చంపింది. మరిన్ని వందల చీమలను గాయపరిచింది. కాని మిగిలిన వేలాది చీమలు దాన్ని పట్టుకుని తినేశాయి.

ఈ కథ చెప్పి, స్థిరజీవి మేఘవర్ణాన్ని ఎడంగా తీసుకుపోయి, "ఈ మాట నీలోనే ఉంచుకో. నేను చెప్పేదంతా శ్రద్ధగా విని అలా చెయ్యి. మనకు గొప్ప ఆపద

రానున్నది. తగిన చర్యలు తీసుకోక పోయామో, నిశ్చయంగా నాశనమై పోతాం. ఇచ్చకాలమాటలూ, బహూకృతులూ, కుట్రలూ, సంఘర్షణా అనే నాలుగు సాధనాలూ మనకు ఉపకరించవు. అందుచేత నా సూచన ఏమంటే: నన్ను బహిరంగ సభలో తీవ్రంగా దూషించి, నా శరీరం నిండా రక్తం పులిమి శత్రుగూఢచారులకు నమ్మకం కలిగించి, నన్ను మర్రిచెట్టు మొదలు దగ్గిరపారేసి, సపరివారంగా ఇక్కడినుంచి లేళ్ళకొండ వద్దకు వెళ్ళాలి. అది రెండు కోసులదూరంలో ఉన్నది. నేను వంచన ద్వారా శత్రువు విశ్వాసం సంపాదించి, వాళ్ళ స్థావరాలు తెలుసుకుని, పట్టపగలు అవి గుడ్డివి గనక, అన్నిటినీ చంపి వచ్చేసే వరకూ మీరు అక్కడే ఉండండి," అన్నది.

అవి మంత్రాలయానికి తిరిగివచ్చాక స్థిరజీవి కాకిరాజుతో, "నీకు శక్తి సామర్థ్యాలు లేవు. నీ వల్ల కాకులకు మేలు ఎలా జరుగుతుంది?" అని ఆక్షేపణగా అన్నది.

కాకి మంత్రులు మండిపోయి, సేనాపతులను పురమాయించి, స్థిరజీవిని హతమార్చటానికి ఉద్యమించారు. కాని మేఘవర్ణం, "ఈ దుర్మార్గుణ్ణి నాకు వదలండి," అని చెప్పి, స్థిరజీవి మీద పడి, భయంకరంగా పొడుస్తున్నట్టు అభినయిస్తూ, దాని శరీరం నిండా రక్తం పులిమి, దాన్ని చెట్టు మొదట్లో పారేసింది. తరవాత అది సపరివారంగా లేళ్ళకొండకు వెళ్ళిపోయింది.

గుడ్లగూబలలో వేగుచెయ్యటంలో అందరినీ మించినది అరిమర్దనం భార్య. అది స్థిరజీవి పతనం అంతా కనిపెట్టి, సంగతంతా అరిమర్దనానికి చెప్పింది. స్థిరజీవి చెట్టుమీది నుంచి కిందపడగానే అది వెళ్ళిపోవడంచేత, మేఘవర్ణం సపరివారంగా చెట్టు విడిచి వెళ్ళిన సంగతి దానికి తెలియదు. వెళ్ళబోతున్నారని మాత్రమే తెలుసు.



# 190. అస్థికాలంకరణ

మధ్యధరా సముద్రంలోని మాల్టాదీవిలో ఎముకలు చాలా ప్రసిద్ధి సంపాదించుకున్నాయి. ఒకచోట తవ్వకాలలో 33,000 ప్రాచీన మానవుల అస్థికలు దొరికాయి. మరోచోట మధ్యయుగపు యోధుల పుర్రెలను ఒక ఆలయంలాటి దానిలో అలంకరణలుగా అమర్చారు. ఇక్కడ బొమ్మలో ఉన్నది శ్మశానవాటికలో ఒక భాగం. ఇందులో రెండువేల పుర్రెలను కుడ్యాలంకరణకు ఉపయోగించారు.





# మాయా సరోవరం

## 22

[నదీతీరంలోని కొండ గుహల ముందున్న మైదానప్రదేశంలో జయశీల, సిద్ధసాధకులకు మకరకేతు కనిపించాడు. అతడి వెంట జయశీలుడి బాల్యమిత్రుడైన దేవశర్మా, సేనాని కొడుకు మంగళవర్మా కూడా వున్నారు. సిద్ధసాధకుడు జలగ్రహాన్నుంచి నరవానరాన్ని కాపాడాడు. అది చేతులెత్తి సాధకుడి ముందు బోర్లపడిపోయింది. తరవాత—]

నరవానరం, సిద్ధసాధకుడికి మచ్చిక అయిపోవటం చూసి, మకరకేతుతోపాటు అందరూ ఆశ్చర్యపోయారు. జయశీలుడు తృప్తిగా ఓసారి నవ్వి, "ఇన్నాళ్ళకు సిద్ధసాధకుడు ఒక వాహనాన్ని సంపాయించినట్టుంది! కాని, అది చాలా ప్రమాదకరమైన వాహనం. కృపాణజిత్తు అనేవాణ్ణి, అది చంపినంతపని చేసింది. ఈ సర్పస్వరుణ్ణి ఎత్తుకుపోయింది. అయినా ఎలా ప్రాణాలతో బయటపడ్డాడో తెలియటం లేదు," అన్నాడు.

"సర్పస్వరుణ్ణి, నేనే నరవానరం నుంచి రక్షించాను. అతడి ద్వారా నువ్వీ ప్రాంతాలవున్నట్టు తెలిసింది," అన్నాడు మకరకేతు.

జయశీలుడు, మకరకేతును ఆపాదమస్తకం ఒకసారి పరీక్షగా చూసి, "నువ్వు తిన్న ప్రాణాంతకమైన గాయాల



మాటేమిటి ? ఇంత త్వరలో నువ్వు కోలు
కోవటం, నా కెంతో ఆశ్చర్యంగా వుంది,''
అన్నాడు.

మకరకేతు, దేవశర్మను చూపుతూ,
''కొండల్లో ఒకచోట చావుబతుకుల మధ్య
వున్న నన్ను, ఈయన తన చికిత్సతో
రక్షించాడు. అందరూ వైద్యదేవుడని
పిలుస్తారు గనక, నేనూ వీరిని ఆ పేరు
తోనే పిలుస్తున్నాను. ఆ మధ్య ఒకసారి
వీరితో మాయాసరోవరానికి వెళ్ళి, తిరిగి
యిక్కడికి వచ్చి, నీ కోసం గాలిస్తు
న్నాను,'' అన్నాడు.

అమరావతీ నగరంలో బాల్యమిత్రుడూ,
జూదగృహంలో తనతోటి జూదరీ అయిన
దేవశర్మ. ఎప్పుడు వైద్య విద్య నేర్చి,
యిలా వైద్యదేవుడయాడో జయశీలుడికి
అర్థం కాలేదు. అతడు దేవశర్మకు
నమస్కరించి, ''అయ్యా, వైద్యదేవా !
ఈ మంగళవర్మ తమ అనుచరుడా ?''
అని అడిగాడు.

ఆ మాటలకు దేవశర్మ నవ్వి, "మంగళ
వర్మ నా శిష్యుడు, నా దగ్గిర వైద్యవిద్య
నేర్చుకుంటున్నాడు. ఒకప్పుడితడికీ
మాయాసరోవరం చేరాలని వుండేది!
అవునా, వర్మా ?'' అన్నాడు.

మంగళవర్మ బాధగానిట్టూరుస్తూ తల
వంచి ఒక్కక్షణం తన కొయ్యకాలు కేసి
చూసుకుని, ఏమో చెప్పబోయేంతలో,
ఆకాశంమీది నుంచి పెద్దగా రెక్కల
చప్పుడు వినిపించింది. అందరూ తలలు
ఎత్తి చూశారు.

ఆకాశంలో చిన్న హంసల గుంపొకటి
ఒక రథాన్ని లాగుతూ ఎగురుతున్నది.
ఆ దృశ్యం చూస్తూనే మకరకేతుడూ,
సర్పనఖ, సర్పస్వరులూ చేతులెత్తి,
''జై, మాయాసరోవరేశ్వరుడికీ!'' అంటూ
ఏక కంఠగ్గా కేకపెట్టారు.

ఆ కేక హంసల రథంలో వున్న వాళ్లు
విని వుంటారు! మరుక్షణం రథం
ఆకాశంలో ఒక క్షణకాలం ఆగి, జయ
శీలుడూ వాళ్ళూవున్న చోటుకు వేగంగా

ఎగురుతూవచ్చి, దాపులనున్న నదీజలంలో దిగింది.

నదీ తీరంలో వున్న మకరకేతూ, అతడి అనుచరులైన సర్పనఖ, సర్పస్వరులూ రథం నీట దిగగానే, ఆశ్చర్యపోతూ దానికేసి చూసి, "సరోవరేశ్వరుడెక్కడ? ఆయన అంగరక్షకుడు ఒంటరిగా రథం మీద ఎందుకొచ్చినట్టు?" అని ఒకళ్ళనొకళ్ళు ప్రశ్నించుకుంటూ, తీరంనుంచి నీటిలోకి దూకి, రథం దగ్గిరకు పోయారు.

ఇప్పుడు ఒడ్డున జయశీలుడూ, సిద్ధసాధకుడూ, వైద్యదేవుడి పేరుతో చెలామణీ అవుతున్న దేవశర్మా, సేనాని కొడుకు కొయ్యకాలి మంగళవర్మా మాత్రమే వున్నారు. జయశీలుడు, దేవశర్మకు కనుసైగచేసి, మంగళవర్మతో, "వర్మా, మనం ఏ నాడూ శత్రువులం కాదు; మిత్రులం కూడా కాదు. నువ్వు మాయా సరోవరానికి వెళ్ళివచ్చినవాడివిలా కనిపిస్తున్నావు. ఆ మాట నిజమేగదా? అక్కడ కనకాక్షరాజుగారి పిల్లలు కాంచనమాలా, కాంచనవర్మా ఎలావున్నారు?" అని అడిగాడు.

మంగళవర్మ ఏదో జవాబివ్వబోయి, తలవంచి తన కొయ్యకాలు కేసి ఒకసారి చూసుకుని, తరవాత తలఎత్తి దేవశర్మ కేసి చూస్తూ, "ఇలాంటి ప్రశ్నలకు జవాబివ్వాలంటే వైద్యదేవుల అనుమతి కావాలి," అన్నాడు.





"నీ గురుభక్తి మెచ్చదగిందే, వర్మా!" అని జయశీలుడు అతణ్ణి మెచ్చుకుని, "అయితే, నా ప్రశ్నను వైద్యదేవుణ్ణే అడుగుతున్నాను," అన్నాడు.

అంతలో అక్కడికి, "జై, మహాకాళా!" అంటూ సిద్ధసాధకుడు నరవానరం మీద ఎక్కి వచ్చి, "జయశీలా! నువ్వలా తాపీగా యీ నీటి పక్షి వెధవల్తో మాట్లాడ తావేం? అవతల ఆ మొసలి ముఖం వాడూ, వాడి నేస్తాలూ, ఆ దిక్కుమాలిన పక్షుల రథం ఎక్కి పారిపోవాలని చూస్తున్నట్టున్నది," అన్నాడు.

"సాధకా, నిజంగా వాళ్ళు పారి పోవాలని చూస్తే, మనం ఆపగలమా? ఒకవేళ వాళ్ళుపోయినా, ఇక్కడ వాళ్ళ అనుచరులిద్దరున్నారు కదా!" అన్నాడు జయశీలుడు.

సిద్ధసాధకుడు మంగళవర్మ కేసీ, దేవశర్మ కేసీ కళ్ళురుముతూ ఒకసారి చూసి, "ఈ మంగళవర్మ మనం ఎరిగిన వాడే! ఈ రెండో అతను నీటిమనిషిలా లేడు. మనం మాయాసరోవరం చేర టానికి సాయపడేవాళ్లు నదిలోకి వెళ్ళారు. వాళ్ళు అటునుంచి అటే పారిపోవటం జరిగితే, ఇక యిప్పట్లో మనం మాయా సరోవరాన్ని చేరలేం," అన్నాడు.

ఆ మాటలకు దేవశర్మ చిన్నగా కోపం తెచ్చుకుని, "సాధకా, నీలో ఆలోచన కన్న, ఉద్రేకంపాలెక్కువలా వుంది. ఆ మకరకేతు పనిగట్టుకుని, యీ కొండ ప్రాంతాలకు ఎందుకొచ్చాడనుకున్నావు? నిన్నూ, నీ మిత్రుణ్ణీ ఆ మాయాసరోవరానికి తీసుకుపోయేందుకే. అక్కడ భయంకరు లైన జలవృక రాక్షసుడి అనుచరులతో, మీ యిద్దరూ పోరాడి, ప్రాణాలతో బయట పడవలసి వుంటుంది," అన్నాడు.

"జలరాక్షసులా? వాళ్ళను మహా కాలుడి అండతో, యీ శూలానికి గుచ్చి, నీటి నుంచి లాగి, ఒడ్డున పడవేయగలను. ఇక జయశీలుడా! అతడి దగ్గిర మహా కాలుడి బంటు కాలకాలుడు స్వయానా

బహూకరించిన ఖడ్గం వుండనే వున్నది.'' అన్నాడు సిద్ధసాధకుడు.

దేవశర్మ ఎవరో తెలియని సాధకుడు అతడితో గిల్లి కజ్జా పెట్టుకునే ప్రమాదం వున్నదని గ్రహించిన జయశీలుడు, దేవశర్మతో, ''అయ్యా, వైద్యదేవా! మీ శిష్యుడైన యీ మంగళవర్మను పంపి, నదిలో మకరకేతు హంసలరథం వాడితో ఆడుతున్న మంతనా లేమిటో తెలుసుకో వచ్చుగదా,'' అన్నాడు.

జయశీలుడు అలాంటి సూచన ఎందుకు చేశాడో గ్రహించిన దేవశర్మ, మంగళ వర్మతో, ''శిష్యా, మంగళా! నువ్వుపోయి, ఆ హంసల రథంలో మాయాసరోవ రేశ్వరుడు కాక, ఆయన అంగరక్షకు డెందుకున్నాడో తెలుసుకురా,'' అన్నాడు.

మంగళవర్మ, దేవశర్మకు తలవంచి నమస్కరించి నదికేసి నడిచాడు. అతడలా వెళ్ళిపోగానే జయశీలుడు, దేవశర్మతో, ''శర్మా, యిప్పుడు చెప్పు— మాయాసరోవరేశ్వరు డనేవాడు అపహ రించుకు పోయిన హిరణ్యపురం రాజ కుమార్తె, కుమారుడూ క్షేమంగా వున్నారా?'' అని అడిగాడు.

''వాళ్ళిద్దరూ క్షేమమే. కాని, వాళ్ళు అపహరించబడినందుకు నువ్వనే హిరణ్య పురం రాజు దుఃఖిస్తూంటే, అపహ



రించుకు వచ్చినందుకు ఆ మాయాసరోవ రేశ్వడుడు విచారపడుతున్నాడు,'' అన్నాడు దేవశర్మ.

జయశీలుడూ, దేవశర్మా యిలా సంభాషించుకునేంతలో సిద్ధసాధకుడు, ''జై, మహాకాళా!'' అంటూ నరవానరం మీది నుంచి కిందికి దూకి, ''జయశీలా, ఏమిటీ చిత్రం? మీరిద్దరూ లోగడే ఒకరి నొకరు ఎరిగివున్నవాళ్ళా? ఆ సంగతి యింతసేపై ఎందుకు దాచావు?'' అని అడిగాడు.

జయశీలుడు అతడిని మెల్లిగా మాట్లాడ మని హెచ్చరించి, ''సాధకా, కొంచెం శాంతించు. ఈ దేవశర్మా, నేనూ బాల్య



మిత్రులం. మా యిద్దరిదీ అమరావతీ నగరం. ఆ నగరంలో ఒకప్పుడు అందె వేసిన జూదగాళ్ళం—అదంతా పెద్ద కథ! ఇప్పుడు మేం యిద్దరం మిత్రులం అన్నే సంగతి మకరకేతుకు తెలియకూడదు. అలా తెలిస్తే, మనం ఆ మాయాసరోవరేశ్వరుడనే వాణ్ణి చిత్రవధ చేసి, కాంచనమాలా, కాంచనవర్మలను బంధ విముక్తుల్ని చేసే అవకాశం వుండదు.'' అన్నాడు.

''అదా సంగతి! ఇప్పుడీ పిట్టలరథం గొడవ వచ్చిపడిందే, దీని వెనక వున్న రహస్యం ఏమిటి? ఈ రహస్యం ఏమిటో మన యిద్దరికీ మిత్రుడైన దేవశర్మకు తెలిసివుండాలి!'' అంటూ సాధకుడు ఒక్క ఊపున పోయి దేవశర్మను ఆప్యాయంగా కౌగలించుకున్నాడు.

దేవశర్మ నవ్వుతూ సిద్ధసాధకుడి భుజం తట్టి, ''మాయాసరోవరంలోని జల వృకరాక్షసుణ్ణి, నువు చంపగలిగితే, నీకు మహాకాలుడి నుంచి సర్వశక్తులూ సిద్ధించ గలవు. ఆ జలవృకుడు, నువ్వు ఆరాధించే మహాకాళుడికి బద్ధవిరోధి!'' అన్నాడు.

''అలాగా! వాణ్ణిపట్టి, నా వాహనమైన యీ నరవానరానికి మేతగా వేస్తాను. ఏం బంటూ నరవానరా!'' అంటూ సిద్ధ సాధకుడు నరవానరం భుజాన్ని శూలంతో చిన్నగా తాకాడు.

నరవానరం ఎగిరి గంతేసి, నది ఒడ్డున నిలబడివున్న ఏనుగు జలగ్రహం కేసి బయలుదేరింది. సాధకుడు చప్పున ముందుకుపోయి, దాని చేయి పట్టుకుని, ''ఆగు, నరవానరా, ఆగు! ఇప్పుడు మనం మకరకేతూ, అతడి యజమాని అయిన మాయాసరోవరేశ్వరుడి మిత్రులం. ఆ నీటి ఏనుగు నీ అన్నలాంటిది, గుర్తుంచుకో!'' అన్నాడు.

ఆ మాటలకు దేవశర్మ బిగ్గరగా నవ్వి, తన చేతిలోని వజ్రాలు తాపిన కర్రను పైకెత్తి, నదికేసి చూపుతూ, ''అక్కడ మాయాసరోవరంలో ఏదో గందరగోళం

జరిగివుండాలి. అలా కాకపోతే, సరోవరేశ్వరుడు జలవిహారం తిరిగే, యీ హంసలరథం యిలా ఆకాశంలోకి ఎగిరి, యిక్కడ యీ నదిలో వాలివుండదు," అన్నాడు.

దేవశర్మ యిలా అంటూండగా ముందు మంగళవర్మా, అతడి వెనకగా విచారంతో తల వంచుకుని మకరకేతూ అక్కడికి వచ్చారు. మకరకేతు కళ్ళనీళ్ళ పర్యంతమైపోతూ, "వైద్యదేవా! ఇంతకు ఒక గంటకాలం ముందు సరోవరంలో హంసలరథం మీద జలవిహారం చేస్తూన్న మాయాసరోవరేశ్వరుణ్ణీ, ఆయన వెంట వున్న రాజకుమారి కాంచనమాలనూ, జలవృకుడి రాక్షసులు హఠాత్తుగా నీటి నుంచి పైకి తేలి, పట్టుకోవాలని చూశారు. రథాన్ని నడిపేవాడూ, అంగరక్షకుడూ ఆ ప్రమాదం తప్పించేందుకు రథాన్ని, నీటిలో నుంచి ఆకాశంలోకి ఎగిరించారు. కాని...." అంటూ యిక మాట్లాడలేక కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ నిలబడిపోయాడు.

దేవశర్మ ఎక్కడలేని ఆదుర్దాకనబరుస్తూ, "రథంలో వుండవలసిన సరోవరేశ్వరుడూ, రాజకుమారి కాంచనమాలా ఏమయారు?" అని అడిగాడు.

మకరకేతు తనను తాను సంబాళించుకుని, "ఘోరం జరిగిపోయింది, వైద్యదేవా! హంసలరథం అలా ఆకాశంలో ఎగురుతూండగా, వాటి మీదికి రాబందు



పక్షుల గుంపొకటి వచ్చి పడిందట. హంసలు బెదిరి, చెల్లా చెదరుగా పారి పోయే ప్రయత్నంలో రథాన్ని తలకిందులు చేసినై. ఆ సమయంలో సరోవరేశ్వరుడూ, రాజకుమారీ, రథాన్ని తోలేవాడూ— ముగ్గురూ పట్టుతప్పి, మహారణ్యంలో ఎక్కడో పడిపోయారు,'' అన్నాడు.

ఆ మాటలు వింటూనే దేవశర్మతో పాటు, జయశీలుడూ, సిద్ధసాధకుడూ నిర్విణ్ణులయిపోయారు. ''రాజకుమారి కాంచనమాల అంత ఎత్తు నుంచి పడి ప్రాణాలతో వుండటం అసంభం! సాధకా, యింతకాలంగా మనం చేసినశ్రమా, పడిన కష్టాలూ—అంతావృధా!'' అన్నాడు, జయశీలుడు ఒరలోని కత్తిని బయటికి లాగి, దూరంగా విసిరివేస్తూ.

''తన తండ్రికి జరిగిన ప్రమాదం సంగతి వింటే పద్మముఖి ఏ అఘా యిత్యానికి ఒడికట్టుతుందో!'' అంటూ దేవశర్మ చేతిలోని వజ్రాలు తాపిన కర్రను గట్టిగా నేలకేసి కొట్టాడు.

సిద్ధసాధకుడు నిబ్బరంగా అందరి ముఖాల కేసీ ఓమారు చూసి, ''నిరాశ పడకండి! రథం నుంచి జారిన ఆ ఇద్దరూ ఏ కలువకొలనులోనో, గుబురుకొమ్మల ఏ వటవృక్షం మీదనో పడి సురక్షి తంగా వుంటారు. మనం వాళ్ళను వెతి కేందుకు కొందరిని పంపి, మిగతావాళ్లం పోయి ఆ జలరాక్షసులను మహాకాలుడికి బలియిద్దాం. ఆ మాయాసరోవరం ఎంత దూరంలో వుంటుంది?'' అన్నాడు.

సిద్ధసాధకుడు మాట ముగించే లోపలే నదివైపు నుంచి, ''జలరాక్షసులు! జలరాక్షసులు!'' అన్న కేకలు విని పించినై.

జయశీలుడితోపాటు అక్కడున్న వాళ్ళందరూ చప్పున తలలు తిప్పి నది కేసి చూశారు. తోడేలు తలలుగల కొందరు రాక్షసులు, రాతి గదలను పైకెత్తి, నదిలో ఈదుతూ హంసల రథాన్ని చుట్టుముట్టేందుకు, దాని కేసి వేగంగా వస్తున్నారు. —(ఇంకావుంది)






# సారథి

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, నువు చేస్తున్న ఈ ప్రయత్నానికి ఫలితం ఎలా ఉంటుందో గాని, ఒక్కొక్కసారి అమితమైన ఈర్ష్యా, అసూయా గాఢమైన స్నేహానికి దారితీస్తాయి. ఇందుకు నిదర్శనంగా నీకు శూరసేనుడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు :

పూర్వం ఒక నదికి రెండుపక్కలా రెండు రాజ్యాలు ఉండేవి. ఉభయ రాజవంశాల మధ్యా అనాదిగా సఖ్యత ఉండటంచేత, ప్రజలమధ్య బంధుత్వాలూ, వర్తక వ్యాపారాదులూ, ఒకరి

## బేతాళ కథలు

వేడుకలలో ఒకరు పాల్గొనటమూ జాస్తిగా ఉండేది. ఇందుకు అనువుగా నదిపైన ఒక పటిష్ఠమైన వంతెన ఏనాడో కట్టారు.

ఇలా ఉండగా ఏ కారణం చేతనో రెండుదేశాల మధ్య వైరం ఏర్పడింది. ఆ వైరం యుద్ధందాకా పోలేదు గాని, రాజులిద్దరూ తమ మధ్య తెగతెంపులు చేసుకున్నట్టు గుర్తుగా నది మీద వారధిని రెండు పక్కలనుంచీ పగలగొట్టారు. దానితో భారీ వాహనాల మీద రాకపోకలు నిలిచిపోయాయి, కాని మామూలు మనుషులు పడవలలో ఒక వైపునుంచి మరొక వైపుకు ప్రయాణంచేస్తూ, గడిచి పోయిన మంచిరోజులను గురించి తలుచుకుని నిట్టూర్చేవారు.

కాలక్రమాన రెండుదేశాల రాజులూ చనిపోయి, వారి కొడుకులు రాజులయారు. నదికి ఎడమప్రక్క ఉన్న రాజు శాంతిసేనుడు, కుడిప్రక్కన రాజ్యం చేస్తున్నవాడు శూరసేనుడు. ఇద్దరూ వివేకవంతులూ, ధర్మబుద్ధి గలవారూనూ. అందుచేత రెండు దేశాల ప్రజలూ సుఖంగానే ఉన్నారు. అయితే వారికి వంతెన లేకపోవటం పెద్ద వెలితిగా కనపడేది.

శూరసేనుడికి తన గూఢచారుల ద్వారా పదే పదే ఒక విషయం తెలియ వచ్చింది. అదేమిటంటే తన దేశపు ప్రజలలో కూడా శాంతిసేనుణ్ణి తనకన్న



హెచ్చుగా మెచ్చుకుంటున్నారు. ముఖ్యంగా అతని దాతృత్వాన్ని గురించి కథలుగా చెప్పుకుంటున్నారు. తాను కూడా దానశీలుడేగద ! తనకన్న శాంతిసేనుడికి అంత కీర్తి ఎలా వచ్చింది ? అవతలి దేశంలో తన పేరు తలుచుకునే వాళ్ళు ఉన్నారా, లేరా ?

శూరసేనుడు కీర్తికోసం మరింతగా దానధర్మాలు చెయ్యనారంభించాడు. అందువల్ల అతని ఆశయం సిద్ధించక పోగా, అతను శాంతిసేనుడితో పోటీపడుతున్నాడన్నమాట పుట్టింది. దానితోఅతనికి వెర్రెత్తిపోయింది. ఈర్ష్య, అవమానమూ అతని మనస్సును దహించి, నిద్రాహారాలు లేకుండా చేశాయి.

చిట్టచివరకు అతను శాంతిసేనుడి గొప్ప ఏమిటో స్వయంగా తెలుసుకోవటానికి నిశ్చయించాడు.

అతను తన రాజ్యాన్ని కొద్దికాలం పాటు మంత్రుల పరంచేసి, మామూలు దుస్తులు ధరించి, పడవ మీద నదిదాటి, శాంతిసేనుడి రాజ్యం ప్రవేశించి, ఒక ధర్మసత్రంలో బసచేసి, ప్రజలమధ్య తిరుగుతూ, వాళ్ళు అనుకునే మాటలు వినసాగాడు. దూరపు కొండలు నునుపు అన్నట్టుగా కాకుండా, శాంతిసేనుడి కీర్తి అతని దేశంలో కూడా హెచ్చుగానే ఉన్నది. ఇక తన పేరు స్మరించే వాళ్ళు శూరసేనుడికి అంతమందిలోనూ ఒక్కడూ కనిపించలేదు.





ఇలా కొన్నాళ్ళు జరిగినాక శూర సేనుడు శాంతిసేనుడి గొప్పతనాన్ని తాను స్వయంగా పరీక్షిస్తేనే గాని నిజం తేలదని నిశ్చయించుకున్నాడు. అతను రాజభవనానికి బయలుదేరాడు. ఇప్పు డతను బట్టలుమాసి, శరీరపోషణ లేక, ఒక దేశపు రాజంటే ఎవరూ నమ్మలేని స్థితిలో ఉన్నాడు.

అతనికి శాంతిసేనుడి దర్శనం చాలా సులభంగా లభించింది. తనను అనామకులు చూడవస్తే తన దర్శనం అంత సులభంగా లభించదనీ, అసలు లభించకనే పోవచ్చుననీ శూరసేనుడు గుర్తు తెచ్చుకున్నాడు.

అతన్ని చూడగానే శాంతిసేనుడు చిరునవ్వు నవ్వి, ''నా నుంచి ఏం కావాలి ?'' అని అడిగాడు.

దానికి శూరసేనుడు, ''మహారాజా, నేను కూడా రాజవంశానికి చెందిన వ్యక్తినే. ఒకప్పుడు నేనూ రాజ్యం చేశాను. కాని కాలవైపరీత్యంవల్ల నా రాజ్యాన్ని పోగొట్టుకున్నాను. మీ కీర్తి ప్రతిష్ఠలు విని యిక్కడికి వచ్చాను. నాకు మీ రాజ్యంలో సగం ఇప్పించండి,'' అన్నాడు.

శాంతిసేనుడు మళ్ళీ చిరునవ్వు నవ్వి, ''ఆశ్చర్య పడకండి. మీరు శూరసేన మహారాజు అని నాకు తెలుసును,'' అన్నాడు.

ఆ మాట వినగానే శాంతిసేనుడి సమక్షంలో ఉన్న భటులందరూ కత్తులు దూసి, శూరసేనుడి కేసి తీవ్రంగా చూశారు. ఎందుకంటే ఉభయదేశాల మధ్యా సంధిలాటిది జరగని కారణం చేత అతను శత్రురాజు !

శాంతిసేనుడు వారిని వారించి, ''శూరసేనా, నీకు రాజ్యం ఉన్నది. అయినా అది చాలక నన్ను అర్ధరాజ్యం కోరుతున్నావు. అర్ధరాజ్యం దేనికి, నా రాజ్యమంతా ఇచ్చేస్తాను, తీసుకో. నేను సామాన్యపౌరుడుగా జీవిస్తాను,'' అన్నాడు.

శాంతిసేనుడికి శూరసేనుడు వెంటనే క్షమాపణ చెప్పుకుని, "నా అసలు కోరిక మనవిచేస్తాను. మన రాజ్యాల మధ్య వారధి మళ్ళీ నిర్మింతాం," అన్నాడు.

ఆ తరవాత కొద్ది నెలల్లోనే, ఆ రెండు దేశాల సరిహద్దుల్లోవున్న నదిమీద, తిరిగి వారధి నిర్మించబడింది. అందువల్ల ఉభయ దేశాల ప్రజలకూ, ప్రయాణాలు సుఖంగా సాగినై. వాళ్ళు తమ రాజుల మధ్య కొత్తగా ఏర్పడిన స్నేహానికి ఎంతగానో సంతోషించారు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, శాంతిసేనుడు ఎంత మహాదాత అయినా, అర్ధరాజ్యం అడిగినవాడికి రాజ్యమంతా ఇస్తాననట మేమిటి? ఇచ్చానన్నాడు గదా అని శూరసేనుడు ఆ రాజ్యాన్ని పుచ్చుకుని, తనమీద పోటీగా ఉన్న, శాంతిసేనుడి పీడ వదిలించుకోక, క్షమాపణ చెప్పుకుని, ముష్టి వారధి కోరట మేమిటి? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "శూరసేనుడు రాజ్యం కోరి రాలేదు, శాంతిసేనుడి దాతృత్వం పరీక్షించటానికి వచ్చాడు. అతనికి శాంతిసేనుడి దాతృత్వమేగాక, ఔదార్యం కూడా అర్థమయింది. ఎందుకంటే, శాంతిసేనుడిలో ఔదార్యం లేకపోతే, ఒంటరిగా చిక్కిన శూరసేనుణ్ణి క్షణంలో హతమార్చి, రెండు దేశాలనూ పాలించగలడు. కాని శాంతిసేనుడు శూరసేనుడి పట్ల మిత్రభావం ప్రదర్శించాడు. అందుచేత రెండు దేశాల మధ్య తిరిగి వారధి ఏర్పడటం అవసరమయింది," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు.

—(కల్పితం)





# మనుషులు-దయ్యాలు

బయట వాతావరణం ఎడాతెరిపి లేని వర్షంతోనూ, హోరుగాలితోనూ, మెరుపులతోనూ, ఉరుములతోనూ, పిడుగులు పడుతున్న చప్పుళ్ళతోనూ నానా భీభత్సంగా ఉన్నది. ఆ వర్షానికి ముసలి దాని పాత పెంకుటిల్లు ఏ క్షణానో కూలిపోయేలా ఉన్నది.

ఆ ఇంట్లో సుబ్బయ్యా, శేషయ్యా, రాజయ్యా అనే ముగ్గురు బాటసారులు ఆ రాత్రికి తలదాచుకున్నారు. వారు ఒకరినొకరు ఎరగరు.

ముగ్గురూ ముందు గదిలో చేరారు. వాతావరణాన్నిబట్టి వాళ్ళు దయ్యాలను గురించి మాట్లాడుకోసాగారు.

సుబ్బయ్య తనకు కలిగిన దయ్యాల అనుభవం గురించి ఇలా చెప్పాడు:

''నేను ఉద్యోగం కోసం ఊళ్ళవెంట తిరుగుతున్న రోజులవి. ఒక ఊళ్ళో సత్రంలో బసచేసి, తెల్లవారేలోపుగా పట్నంచేరాలని, చీకటితోనే బయలుదేరాను. సత్రంలో మనుషులు నన్ను ఆపాలని చూశారు; దారిలో ఒక వల్లకాట్లో చింతచెట్టు మీద ఒక దయ్యం చేరిందనీ, అటుగా వెళ్ళేవాళ్ళని ఏడిపిస్తుందనీ అన్నారు. అయితే, నాకు దయ్యాలంటే నమ్మకంలేక చీకట్లోనే పట్టణానికి బయలుదేరాను. శ్మశానం ప్రాంతం చేరేసరికి గుడ్లగూబల అరుపులూ, నక్కల ఊళలూ వినిపించాయి. నేను చింతచెట్టు చేరేసరికి గుబురుగా ఉన్న చింతకొమ్మలు కదిలాయి. నాకు కొంచెం భయంవేసింది. కొమ్మల మధ్య తెల్ల తెల్లగా కనిపిస్తూ, దయ్యం కాబోలు, ''ఎవరువారు ? ఎంత ధైర్యం ఈ వైపు రావడానికి ?'' అని భీకరంగా అరిచింది. నాకు ముచ్చె

మాచిరాజు కామేశ్వరరావు

మటలు పోశాయి. అయినా ధైర్యం తెచ్చుకుని, 'నేనూ దయ్యాన్నేలే !' అన్నాను. కొమ్మల్లో నుంచి వెర్రికేక వినిపించింది. దభీమని చెట్టుమీదినుంచి ఎవరో కిందపడ్డారు. నాకు అంతా అర్థమయింది. వాడెవడో దయ్యంలా నటించి అందరినీ భయపెడుతున్నాడు ! వాణ్ణి మోసుకుని ఊళ్ళోకి వెళ్ళి, 'ఇదుగో మిమ్మల్ని పీడిస్తున్న దయ్యం,' అని, జరిగినదంతా ఊళ్ళోవాళ్ళకు చెప్పాను. వాళ్ళు తమ పీడ విరగడ అయినందుకు సంతోషించి, చందాలు వేసుకుని, నాకు కొంత డబ్బు ముట్టజెప్పారు."



శేషయ్య తన అనుభవాన్ని ఇలా చెప్పాడు :

"ఉద్యోగరీత్యా నేను పట్టణంలో స్థిరపడ్డాను. కాని ఉండడానికి ఇంకా ఇల్లు చూసుకోలేదు. పట్నంలో ఒక చివరగా పాడుపెట్టిన పెంకుటిల్లు ఉన్నది. అది దయ్యాల కొంప అని చెప్పుకునేవారు. నాకు దయ్యాలంటే భయంలేదు. అందుకని ఆ ఇంట ఉండటానికి నిశ్చయించాను. ఆ రాత్రి భోజనం చేసి, ముందు గది శుభ్రంచేసి, లోపల గడియపెట్టి, నిశ్చింతగా నిద్రపోయాను. ఒకరాత్రివేళ అలికిడికి మెలకువ వచ్చింది. ఇల్లంతా రకరకాల చప్పుళ్లు ! లోపల గజ్జెలమోత ! తల తిప్పి చూస్తే ఏవో నీడలు కదలడం కనబడింది. ముందు భయంవేసింది. కాని పరిశీలనగా చూస్తే బయటి కొబ్బరిచెట్ల నీడలు వెన్నెలలో లోపలపడి, కదులుతున్నాయి. కాస్త ధైర్యం తెచ్చుకుని లోపల గదిలోకిపోయి చూశాను. వందల కొద్దీ ఎలుకలు ! అవి వీరవిహారం చేస్తూన్న చప్పుళ్ళే నేను విన్నది. నన్ను చూడగానే ఒక పెంపుడు పిల్లి మ్యావ్ అని అరిచి, దాని కాళ్ళకు కట్టిన గజ్జెలు చప్పుడు చేస్తూ, కిటికీలో నుంచి బయటికి వెళ్ళిపోయింది. ఆ ఇంటి యజమాని, నేను ఆ ఇంట ఉండి దీపం

పెడతా నన్నదే చాలునని, అద్దెకూడా అడగకుండా నా కా ఇల్లు ఇచ్చేశాడు. దయ్యాలూ లేవు, భూతాలూ లేవు! అంతా మన భ్రమ !"

రాజయ్య తన అనుభవం ఇలా చెప్పాడు :

"ఒకనాడు వీధివెంట పోతూ, ఒక ఇంటి ముందు చాలామంది మూగి ఉండడం చూశాను. ఆ ఇంట్లో ఒక అమ్మాయికి దయ్యం పూనిందిట. ఎవరో భూతవైద్యుణ్ణి పిలవమంటున్నారు. నాకు దయ్యాలంటే నమ్మకంలేదు. 'ఈ భాగ్యానికి భూతవైద్యు డెందుకు ? నేనే దయ్యాన్ని క్షణంలో వదలగొట్టగలను,' అని చెప్పి, వెర్రిగా వాగుతున్న ఆ అమ్మాయిని పక్కగదిలోకి తీసుకుపోయి, ఆమె చెంపమీద చాచికొట్టి, 'చెప్పు ! ఈ దొంగనాటకం ఎందుకు ఆడుతున్నావో చెప్పకపోతే నీ కీళ్ళన్నీ విరిచేస్తాను,' అని బెదిరించాను. ఆ అమ్మాయి వెక్కి, వెక్కి ఏడుస్తూ, 'నటించక ఏంచెయ్యను ? నా సవతి తల్లి నన్ను రాచి రంపాన పెట్టుతున్నది. ఇప్పుడు నన్ను ఒక ముసలి రోగిష్ఠికి ఇచ్చి పెళ్ళిచెయ్యాలని చూస్తున్నది. ఈ పెళ్ళి తప్పిపోవడానికే నేను నాటకం ఆడుతున్నాను,' అన్నది. ఆమె మీద చెయ్యి చేసుకున్నందుకు పశ్చాత్తాపపడి, 'ఈ నాటకం అనవసరం. నీ కిష్టమైతే నేనే నిన్ను చేసుకుంటాను,' అన్నాను. ఆమెను పెళ్ళాడాను కూడా. అందుచేత, దయ్యాలు పూనడం వొట్టి బూటకం. అసలు దయ్యాలంటూ ఉంటేగద, పూనడానికి ?"

బయట వర్షం నిలిచిపోయింది. ముగ్గురూ ఆ గదిలో తలా ఒక మూల సర్దుకుని పడుకున్నారు. వాళ్ళు ముగ్గురూ వెంటనే నిద్రపోయారు. వాళ్ళు నిద్ర లేచేసరికి భళ్ళున తెల్లవారింది. ముగ్గురూ ఉలిక్కిపడి లేచి కూర్చున్నారు.

ముసలిది లేదు ! పెంకుటిల్లు లేదు ! వాళ్ళు ముగ్గురూ శ్మశానంలో ఒక పెద్ద సమాధి మీద ఉన్నారు.





# సుబ్బయ్య నిజాయితీ

సూళూరు పట్టణం దగ్గిర ఒక గ్రామంలో సుబ్బయ్య అనే యువకుడు ఉండేవాడు. అతను తెల్లవారిలేచి, గొడ్డలి తీసుకుని అడవికి వెళ్ళి, కట్టెలు కొట్టి తెచ్చి, రెండు రూపాయలు సంపాదించేవాడు. ఆ రెండు రూపాయలలో ఒకటి తల్లి కిచ్చి, ఇంకొకటి తనకు ఉంచుకుని, అపరాహ్ణంవేళ మంచి దుస్తులు వేసుకుని, సూళూరుపట్టణం వీధుల్లో సవారీ చేసేవాడు. అతన్ని చూసి సూళూరులో అందరూ శ్రీమంతుడనుకుని, ''సుబ్బయ్య ప్రభువు,'' అని పిలిచేవాళ్ళు.

ఒకసారి ఒక విదేశీవ్యాపారి ఖరీదైన జరీబట్టల మూటతో వచ్చి, సూళూరులో ఒక్క చీరకూడా అమ్మలేకపోయాడు. ఎందుకంటే అతని దగ్గిర వెయ్యి రూపాయలకు తక్కువ ఖరీదుచేసే సరుకు లేదు. అతని సరుకు చూసినవారు, ''ఇలాటివి సుబ్బయ్య ప్రభువు తప్ప ఇంకెవరూ కొనలేరు,'' అన్నారు వర్తకుడితో.

వర్తకుడు సుబ్బయ్య వచ్చేచోటు తెలుసుకుని, వేచి ఉండి, అతను గుర్రంమీద రాగానే ఆపి, వినయంగా తన సంగతి చెప్పి, ఒక్క వస్తువైనా కొని, తాను సూళూరు ఎంతో శ్రమపడి వచ్చినందుకు ఫలితం ఉండేటట్టు చెయ్యమన్నాడు.

సుబ్బయ్య దర్పంగా ఒక చీరనూ, ఒక రవికె ముక్కనూ ఏరుకుని, "రేపు ఇదే చోటికి ఇదే వేళకు వస్తాను. అప్పుడు యివి కొనుక్కుని డబ్బు ఇస్తాను,'' అన్నాడు.

అయితే సుబ్బయ్య వర్తకుడికి ఇచ్చిన మాట నిలబెట్టుకోవటం సాధ్యంకాదు.

ఆర్. భవానీప్రసాదరావు

అతను ఇక సూళూరు వీధుల్లో ముఖం చూపించలేడు. అతను చేసేదేమీలేక, ఆ రాత్రి ఇల్లు విడిచి, దూరంగా అడవులూ, కొండలూ ఉన్న ప్రాంతానికి బయలు దేరాడు.

అడవిలో ఒకచోట కాగడా వెలుగులో ఇద్దరు మనుషులు తగవులాడుకోవటం అతనికి కనపడింది. వాళ్ళ దగ్గిర ఒక మూట ఉన్నది. వాళ్ళమాటలవల్ల సుబ్బయ్యకు తెలిసినదేమంటే, ఆ అడవిలో ఎవరో రాజకుమారుడు డేరా వేశాడు. అతని దగ్గిరనుంచి ఈ ఇద్దరూ ఆ మూటను దొంగిలించుకు వచ్చి, ఎక్కువ కష్టపడినది నేనంటే నేననీ, నాకు పెద్దవాటా రావాలంటే, నాకు రావాలనీ పేచీపడుతున్నారు.

అన్ని జంతువుల అరుపులూ అనుకరించగల సుబ్బయ్య, దొంగలకు సమీపంగా ఉన్న ఒక పొద చాటున చేరి పెద్దపులిలాగా గాండ్రించాడు. అది విని దొంగలిద్దరూ హడలి, పారిపోయారు. సుబ్బయ్య కాగడాను ఆర్పేసి, పులిలాగా గాండ్రిస్తూ ఆ మూట తీసుకుని, రాజకుమారుడి డేరాకు వెళ్ళాడు.

రాజకుమారుడు ధనం మూట తీసుకుని, జరిగిన సంగతి తెలుసుకుని, అతనికి ''నిజాయితీ సుబ్బయ్య'' అని బిరుదు ఇచ్చి, ఆ మూటను అతనికే ఇచ్చేశాడు. ఆ మూటలో నాలుగువేలు నగదు ఉన్నది.

మర్నాడు ఉదయం సుబ్బయ్య మామూలుగానే కట్టెలు కొట్టి అమ్మి,



మధ్యాన్నం దాటినాక ''సుబ్బయ్య ప్రభువు'' అవతారంలో గుర్రం మీద మహాశీవిగా సూళూరుపట్టణం వెళ్ళి, వ్యాపారి వద్ద 1500 లకు చీరా, రవికే కొన్నాడు.

తరవాత వాటిని ఏంచెయ్యాలా అన్న సమస్య వచ్చింది. బారకూరి రాజ కుమార్తె చాలా అందగత్తె అని తాను వినిఉన్న సంగతి అతనికి గుర్తుకు వచ్చింది. వ్యాపారి చేతనే ఆ చీరనూ, రవికెనూ ముచ్చటగా పొట్లం కట్టించి, ''మీరు బారకూరు వెళ్ళి, వీటిని అక్కడి రాజు కిచ్చి, సూళూరునగరం నిజాయితీ దత్తయువరాజు రాజకుమారికి కానుకగా పంపినట్టు చెప్పండి,'' అన్నాడు.

ఈ పని చేసి పెట్టినందుకు గాను సుబ్బయ్య, వ్యాపారికి దారి ఖర్చులూ వాటినిమిత్తం మరో అయిదువందలు ఇచ్చాడు.

వ్యాపారి సుబ్బయ్య చెప్పినట్టే బారకూరు వెళ్ళి, చీరనూ, రవికెనూ అక్కడి రాజకుమార్తెకు అందజేశాడు. ఆమె వాటిని చూసి ముచ్చటపడి, వ్యాపారికి ఒక మణి ఇచ్చి, తనకు కానుక పంపినవారికి దాన్ని ఇయ్య మన్నది.

వ్యాపారి మళ్ళీ సూళూరు వచ్చి, పట్టణ వీధిలో సుబ్బయ్యను కలుసుకుని, రాజకుమారి ఇచ్చిన మణిని ఇచ్చాడు.

సుబ్బయ్య దాన్ని తీసుకోక, ''నేను తొందర పనిమీద పోతున్నాను. అందు



చేత మీరే ఈ మణిని తీసుకుపోయి, ఇది బారకూరు రాజు కానుకగా పంపినట్టు చెప్పి ఈ నగరం రాజుగారికి ఇయ్యండి,'' అని గుర్రాన్ని దౌడు తీయించాడు.

వ్యాపారి తెచ్చిన మణిని చూసి సూళూరు రాజూ, యువరాజూ ఎంతో ఆశ్చర్యపడి, సంగతంతా తెలుసుకుని, ''రేపు ఆ సుబ్బయ్య ప్రభువును ఇక్కడికి తీసుకురా !'' అన్నారు.

మర్నాడు సుబ్బయ్య వ్యాపారి వెంట రాజభవనానికి వెళ్ళి, వినయంగా రాజుకూ, రాజకుమారుడికీ నమస్కరించాడు.

రాజకుమారుడు అతన్ని గుర్తుపట్టి, ''నువా, సుబ్బయ్యా ? నీ పేరు నిజాయితీ దత్తయువరాజు అని ఈ వ్యాపారికి చెప్పావుట, ఎందుకూ?'' అని అడిగాడు.

''నాకు గొప్ప వేషం వేయాలని మోజే తప్ప, నా వృత్తి చిన్నది. నేను వేసే వేషంవల్ల కలిగే లాభాలను తగిన వారికే అందనిద్దామని ఇలా చేశాను. నాకు నిజాయితీ బిరుదు ఇచ్చిన యువరాజు మీరేగద !" అన్నాడు సుబ్బయ్య.

''అయితే ఆ లాభంలో నువూ కొంత భాగం పంచుకోక తప్పదు,'' అన్నాడు రాజుగారు.

సూళూరు యువరాజుకు, బారకూరి రాజకుమార్తెను అడగాలని వాళ్ళు అనుకున్నదే. ''నిజాయితీ దత్తయువరాజు'' పంపిన కానుక చూస్తూనే రాజకుమారి అతన్ని వరించింది. అందుచేత, యువరాజే వచ్చి అడిగేసరికి సంబంధం కుదిరింది. ఇద్దరికీ వివాహం అయిన సమయంలోనే సుబ్బయ్య రాజకుమారి చెలికత్తెను పెళ్ళాడక తప్పలేదు.



# దూరదృష్టి

పూర్వం కాంతిపురం అనే పట్టణంలో ఒక సుప్రసిద్ధ న్యాయమూర్తి ఉండేవాడు. న్యాయం కోసం అతని వద్దకు ఎన్నెన్నో యోజనాల దూరంనుంచి జనం వచ్చేవారు.

ఆయన కీర్తి రాజుగారిదాకా వెళ్ళింది. రాజుగారు ఆయనను స్వయంగా చూసి అభినందించటానికి స్వయంగా బయలుదేరి వచ్చాడు.

న్యాయస్థానం బయట ఇసకవేస్తే రాలని జనం! రాజు అది చూసి నివ్వెరపోయి, న్యాయమూర్తితో, "మీరు చేసే న్యాయంలో ఇంతమందికి విశ్వాసం ఉండటం చాలా ఆశ్చర్యం. మీవంటి న్యాయమూర్తి దేశంలో ఉన్నందుకు నేనెంతో గర్వపడుతున్నాను," అని ప్రశంసించాడు.

న్యాయమూర్తి నవ్వి, "ఇలా వేలాది జనానికి న్యాయం చెప్పడంకన్నా, వీరంతా అన్యాయానికి గురికాకుండా చూడటం గొప్ప విషయం కదా! నగరంలో అన్యాయాలు నానాటికి మితిమీరిపోతున్నాయి," అన్నాడు.

రాజుకు వెంటనే జ్ఞానోదయం అయి, నగరంలో జరుగుతున్న అన్యాయాలను గురించి ఆరాతీసి, వాటిని అరికట్టే చర్యలు తీసుకున్నాడు.

— కె. ప్రభాకరదేవ్






ఒక గ్రామంలో రాముడూ, భీముడూ, సోముడూ అని ముగ్గురు స్నేహితు లుండేవాళ్ళు. వాళ్ళకు చదువు సంధ్యలూ, సుఖంగా జీవించటానికి తగిన ఆస్తిపాస్తులూ ఉండేవి. అయినా వాళ్లు తృప్తిచెందక ఇంకా ఏదో కావాలని ఆరాటపడేవారు.

అక్కడికి సమీపంలోనే ఉన్న భయంకరారణ్యంలో ఒక ముని ఉన్నా డనీ, ఆయనను దర్శించినట్టయితే, అంతులేని సంపదగల గుహకు ఆయన దారి చెబుతాడనీ వారికి తెలిసింది.

వెంటనే మిత్రులు ముగ్గురూ బయలుదేరి భయంకరారణ్యంలోకి ఎన్నో బాధలుపడుతూ ప్రయాణంచేసి, ముని ఆశ్రమం కనుక్కొని, ఆయనకు ప్రణామంచేసి, గుహకు దారి అడిగారు.

ముని వారితో, "నాయనలారా, ఆ గుహకు వెళ్ళడం మాటలుకాదు. దారిలో భయంకర క్రూరమృగా లున్నాయి. గుహ లోపల ఇంకా భయంకరమైన సర్పాలున్నాయి. ఈ రాత్రికి మా ఆశ్రమంలో ఉండి, రేపు ఏమి చేయాలో నిర్ణయించుకోండి." అంటూ ముగ్గురికీ మూడు కుటీరాలు చూపించాడు. వాళ్ళకు సపర్యలు చెయ్యటానికి ముగ్గురు అప్సరసలలాటి మునికన్యలు నియోగించబడ్డారు.

రాముడూ, భీముడూ తమకు సేవలు చేసిన స్వయంప్రభనూ, రత్నమాలనూ చూసి ముగ్ధులై, వారిని వివాహంచేసు కుంటే తమ జన్మలు ధన్యమవుతాయనీ, ధనం కోసం గుహకు వెళ్ళి, దారిలో క్రూరమృగాల వాతపడటం మతిమాలిన పని అనీ తేల్చుకుని, మర్నాడు మునితో ఆ మాట చెప్పారు. ముని సరేనని

" వసుంధర "

రాముడికి స్వయంప్రభనూ, భీముడికి రత్నమాలనూ ఇచ్చి, తన దగ్గిర ఉన్న కొన్ని మణులుకూడా ఇచ్చి వాళ్ళను మరింత ఆనందపరచి పంపేశాడు.

సోముడికి సపర్యలు చేసిన కన్య కూడా అందమైనదే, అయితే ఆమె సోముడి మనసును బలంగా ఆకర్షించ లేదు. అతని మనసు గుహలోని రత్న రాసుల మీదే ఉన్నది.

ఆ సంగతి గ్రహించి ముని అతనికి గుహకు వెళ్ళేదారి చెప్పి, "జాగ్రత్తగా ఆత్మరక్షణ చేసుకో," అని హెచ్చరించాడు.

సోముడు క్షేమంగానే గుహకు చేరాడు. అతనికి దారిలో భయంకర ప్రమాదాలేవీ తటస్థపడలేదు. అతను గుహ నుంచి తాను మోయగలిగినన్ని మణిమాణిక్యాలు తీసుకుని, తన గ్రామానికి తిరిగి వెళ్ళక, నగరంలో పెద్దభవంతి కట్టించి, దాసదాసీజనంతో రాజవైభోగంగా జీవించసాగాడు.

కొంతకాలం ముగ్గురూ తృప్తిగానే జీవించారు. అయితే రాముడిలోనూ, భీముడిలోనూ అసంతృప్తి తలఎత్తింది. (భీముడి భార్య తన భార్యకన్న అందమైనదిగా రాముడికి తోచింది. రాముడి భార్య తన భార్యకన్న అందమైనదిగా




భీముడికి తోచింది.)

ఒకరోజు వాళ్ళిద్దరూ కలుసుకుని, "మనకన్న సోముడు అదృష్టవంతుడు. వాణ్ణి ఒకసారి చూసివద్దాం," అనుకున్నారు.

వాళ్ళు వెళ్ళేసరికి సోముడి ఇల్లు రాజభవనం లాగున్నది. అక్కడి దాసీలు రంభను తలదన్నేలాగా ఉన్నారు. అయితే సోముడి ముఖంలో ఆనందం కనిపించలేదు.

రాముడూ, భీముడూ ఒక వారం రోజులు సోముడితో గడిపి, "మేం ముని ఆశ్రమానికి పోతున్నాం. అక్కడ మాకు కొంచెం పని ఉంది," అన్నారు. సోముడు

తానుకూడా వస్తాననీ, తనకూ మునితో పని ఉందనీ అన్నాడు.

ముగ్గురూ కలిసి ముని ఆశ్రమానికి వచ్చారు. ముని ముగ్గురి ముఖాలలోనూ అసంతృప్తి గమనించి, వారికి వేరు వేరు కుటీరాలిచ్చి, ఒక్కొక్కరినీ విడిగా కలుసుకుని ప్రశ్నించాడు.

రాముడు ఆయనతో, ''మీరు నన్ను గుహకు వెళ్ళకుండా భయపెట్టారు. అందమైన రత్నమాలను భీముడికీ, సామాన్యమైన స్వయంప్రభను నాకూ ఇచ్చారు,'' అన్నాడు.

భీముడు కూడా, సోముడికి లాగా తనకు అంతులేని ధనం దక్కకపోవడం గురించీ, స్వయంప్రభలాటి అందగత్తె గాక, సామాన్యమైన రత్నమాల తనకు భార్యకావడం గురించీ తన అసంతృప్తి వెలిబుచ్చాడు.

సోముడు, ''మునీశ్వరా, సంపద నాకు సుఖమూ, శాంతీ లేకుండా చేసింది. నా కున్న ఆత్మీయులంతా నా సంపదను బట్టి ఏర్పడినవారే. గుహకు పోకుండా నన్ను మీరెందుకు వారించలేదు? నా జన్మకు అర్థంలేకుండా పోయింది,'' అన్నాడు.

ముని ముగ్గురినీ ఒకచోట చేర్చి, ''మీరు స్వయంగా చేసిన నిర్ణయాలను గురించి నన్ను ఆక్షేపిస్తున్నారు. మీలో ఎవరినీ నేను గుహకు పోవద్దనలేదు. మీ భార్యలను కూడా మీరే ఎన్నుకున్నారు. కాని మీకు సంతృప్తిలేదు. మీకు కావలసినది సంతృప్తే అయితే, మీకు ఉండినదానితోనే సంతృప్తిపడి ఉండవచ్చు, నా దాకా రానవసరంలేదు. ఇప్పటికైనా మించిపోలేదు. మీ మనసులు మార్చుకుని ఉన్నదాంతో సంతృప్తి పడడం నేర్చుకోండి,'' అన్నాడు.

తమ భార్యలు ఇతరుల కళ్ళకు అందంగా కనిపిస్తున్నారని తెలియగానే రాముడూ, భీముడూ తిరిగి తమ భార్యల అందం గ్రహించగలిగారు. సోముడు తనకు నచ్చిన భార్యను పెళ్ళాడి, రాజవైభోగాలకు స్వస్తిచెప్పి సామాన్యుడిలాగా జీవించసాగాడు.






చిత్రకేతు డనే రాజుకు దానకర్ణు డనే బిరుదు ఉండేది. అతను తన రాజ్యంలో పేదవారికి ఎలాటి కష్టాలు రాకుండా ధానధర్మాలు చేస్తూండేవాడు. అతని పొరుగుదేశం మాళవదేశం. దానికి రాజైన మాధవవర్మ చిత్రకేతుకు గర్భ శత్రువు. అప్పుడప్పుడూ చిత్రకేతుడి దేశంమీదికి దాడులు జరిపి, చావుదెబ్బ తిని వెనక్కి పోతూండేవాడు.

ఇలా ఉండగా ఒకసారి మాళవ దేశంలో భయంకరమైన కరువు వచ్చింది. ప్రజలకు తిండిలేదు. వారిలో హాహాకారాలు బయలుదేరాయి. తన ప్రజల బాధలను మాధవవర్మ పట్టించుకోలేదు. అందుకని మాళవదేశ ప్రజలు చిత్రకేతు రాజ్యంలోకి కాందిశీకులుగా రాసాగారు. చిత్రకేతు వారికి తగిన విధంగా తిండీ, వసతీ ఏర్పాటుచేసి, ఆదుకున్నాడు. చివరకు మాధవవర్మ కింద ఉండే సైనికులు కూడా చిత్రకేతు కింద కొలువులో చేరారు.

ఒకనాటి రాత్రి చిత్రకేతు మహారాజుకు ఒక కల వచ్చింది. అందులో అతను ఒక దివ్యమైన భవనంలో తిరుగుతున్నాడు. దేవతల్లాటి వ్యక్తులు ఆ భవనం మధ్య చావడిలో ఒక రత్నఖచిత సింహాసనాన్ని తెచ్చిపెట్టి, దానిమీద మెత్తలు పరిచి హడావుడి చేస్తున్నారు.

చిత్రకేతు వారిని సమీపించి, ''ఎవరి కోసం ఈ సింహాసనం ? దీన్ని అలంకరించనున్న దివ్యపురుషుడు ఎవరు ?'' అని అడిగాడు.

వాళ్ళు అతనితో, "భూలోకంలో చిత్రకేతు అనేరాజు పేదలపాలిటి కల్పవృక్షమై ఉన్నాడట. అతన్ని ఒకసారి

జి. రంగారావు

ఇక్కడికి తెచ్చి, సన్మానించటానికి ఏర్పాట్లు జరుగుతున్నాయి,'' అన్నారు.

కల కరిగిపోయింది. రాజు పరమానందభరితుడై లేచాడు. తన దాతృత్వాన్ని దేవతలు కూడా మెచ్చుకుంటున్నారన్న మాట! ఇంకా ఎక్కువగా దానాలు చేసి, ఎక్కువ పుణ్యం సంపాదిస్తే, దేవతలు ఇంకా ఎక్కువగా మెచ్చుకుని, ఎలా సన్మానిస్తారో చూడాలని చిత్రకేతుకు అనిపించింది. వెంటనే అతను తన భటులను పంపి, రోజుకు వెయ్యిమందిని కోటకు తెప్పించి, వారికి బంగారం పంచసాగాడు.

దీని ఫలితంగా ఖజానా క్రమంగా ఖాళీ కాసాగింది. ప్రజలలో డబ్బు ముమ్మరమయిందిగాని ప్రజాసౌకర్యాలకు డబ్బు లేదు. డబ్బు పుష్కలంగా చేతిలో ఆడుతున్నందువల్ల ప్రజలు తాగుడూ, జూదమూలాటి వ్యసనాలు మరిగారు. ధరలు ఆకాశాన్ని అందుకున్నాయి. దేశంలో తీవ్రపరిస్థితి ఏర్పడింది. చిత్రకేతు ఇదేదీ పట్టించుకోకుండా, దేవతలు తనకు చేయబోయే సన్మానం గురించి ఊహాగానాలు చేస్తూ వచ్చాడు.

మళ్ళీ అతనికి కల వచ్చింది. ముందు చూసిన దివ్యభవనమే! అదే సింహాసనం! అదే వ్యక్తులు! అయితే వాళ్ళు సింహాసనం పక్కగా తట్టెడు పేడ తెచ్చి పెట్టారు, సింహాసనంమీద ముళ్ళకంప వేశారు. సింహాసనం పక్కన బల్లమీద ఒక కొరడా ఉంచారు.

ఇదంతా ఏమిటని చిత్రకేతు అడిగితే, వాళ్ళు, ''చిత్రకేతు అనేరాజు పాత్రాపాత్ర విచక్షణ లేకుండా ధనం దానం చేసి, ప్రజలను సోమరిపోతులనుగా మార్చాడు. అతన్ని శిక్షించాలి'' అన్నారు.

రాజు భయంతో ఒక్క కేకవేసి, మేలుకున్నాడు. అతనికి తన అవివేకం అర్థమయింది. అతను పూర్వంలాగా ప్రజాక్షేమమే దృష్టిలో పెట్టుకుని, ఆదర్శంగా పాలించసాగాడు.



# చిత్త విశ్రాంతి

అయోధ్య రాజైన శిశుమంతుడికి భాగవతం అంటే చాలా అభిమానం. ఆయనకు మనసు ఆందోళనగా ఉంటూ రావటంచేత, భాగవత సప్తాహం జరిపించాడు. అంటే ఒక పండితుడిచేత వారం రోజులపాటు భాగవతం చదివించి, తర్వాత సంతర్పణ చెయ్యటం.

అయినా రాజుకు చిత్త విశ్రాంతి కలగలేదు. అది తనకు ఎందుకు చేకూరలేదో తెలుసుకోవాలని పండితుణ్ణి అడిగాడు. రాజు తనను దండిస్తాడని పండితుడు అనుమానించి, తనను ఒక స్తంభానికి కట్టేయమని రాజును అడిగాడు. ఆ పని పూర్తిఅయాక పండితుడు రాజును కూడా మరొక స్తంభానికి కట్టేయమన్నాడు. అది కూడా అయాక పండితుడు, "మహారాజా, నేను బాధలలో చిక్కుకున్నాను, నన్ను తమరు విముక్తుణ్ణి చెయ్యండి," అని ఆక్రోశించాడు.

"నీ మాటలకు అర్థం ఉందా? నేనుకూడా బంధింపబడి ఉండి, నీకు బంధ విముక్తి ఎలా కలిగిస్తాను?" అన్నాడు రాజు.

"తమరు నా ద్వారా చిత్త విశ్రాంతి కోరటం కూడా అలాగే ఉంది. ఇద్దరమూ ప్రాపంచిక బాధలలో చిక్కుకున్న వాళ్ళమే. తమరిని తృప్తిపరచి డబ్బు సంపాదించాలని నా తాపత్రయం. భాగవతం విని చిత్తవిశ్రాంతి పొందాలని మీ తాపత్రయం. విముక్తుడైన వాడే మరొకడికి విముక్తి కలిగించగలడు," అన్నాడు పండితుడు.

— ఎం. ఆర్. కె. నాయర్





# తెలివి వుండాలి!

నందనపురంలో రత్నాకరుడు పెద్ద వర్తకుడు. అతని ఏకపుత్రుడు అజిత సేనుడు. ''కాయంగుల'' పట్టణంలో శీలవతి అనే పిల్ల, ధనికుడి కుమార్తె, చక్కనిదనీ, తెలివిగలదనీ, గుణవతి అనీ నలుగురూ చెప్పగా విని, రత్నాకరుడు ఆమెను అజితసేనుడికి పెళ్ళి చేశాడు. ఆమె తెలివితేటలూ, అందమూ చూసి, అజితసేనుడు ఆమెతో అనుకూలంగా కాపరం చేయసాగాడు. రత్నాకరుడు మాత్రం తన కోడలిని కనిపెట్టి ఉన్నాడు.

ఒకనాటి అర్ధరాత్రి శీలవతి ఒక ఖాళీ కుండను తీసుకుని ఇంటినుంచి బయలుదేరి, చాలాసేపటికి ఆ కుండలేకుండా తిరిగి వచ్చింది. అది మామగారు గమనించి, తన కోడలు సాహసి అనీ, అలాటి మనిషి ఉభయ కుటుంబాలకూ అపకీర్తి తేగలదనీ అనుకుని, మనసులో చాలా బాధపడి, మర్నాడు తన కొడుకుతో, "కొంతకాలం నీ భార్యను పుట్టింట ఉండి రానీ," అన్నాడు. ఆమె ఇక్కడ సుఖంగానే ఉంటున్నది కదా అని కొడుకు అంటే, ''కాదు, ఆమె పుట్టింటికి వెళ్ళితేనే మంచి," అని తండ్రి పట్టుబట్టాడు.

తన కోడలిని పుట్టింటికి చేర్చే బాధ్యత తానే తీసుకుని రత్నాకరుడు ఆమెను వెంటబెట్టుకుని బయలుదేరాడు. దారిలో ఒక వాగు వచ్చింది. కాలి చెప్పులు తీసి చేత బట్టుకుని నీటిలోకి దిగమని మామగారు కోడలికి చెప్పాడు. కాని ఆమె చెప్పుల కాళ్ళతో వాగు దాటింది. ఆమె తన మాట విననందుకు రత్నాకరుడు బాధపడ్డాడు, కాని పైకి ఏమీ అనలేదు.

"సాహితీప్రియ"

కొంతదూరం పోయాక ఒక విరగ పండిన చేను కనిపించింది. ''చక్కని పంట! ఖామందు మంచి లాభం పొందుతాడు," అన్నాడు మామగారు.

"తినెయ్యకుండా ఉంటేనూ!" అన్నది కోడలు.

అంత తెలివితక్కువగా మాట్లాడే తన కోడలుకు తెలివిగలదని ఎలా పేరు వచ్చిందో రత్నాకరుడికి తెలీలేదు.

తరవాత వాళ్ళు ఒక నగరం కుండా వెళ్ళటం తటస్థించింది. ''ఈ పట్టణం ఎంత బాగున్నది!'' అన్నాడు రత్నాకరుడు.

''శత్రురాజులు దీన్ని ధ్వంసం చెయ్యకుండా ఉంటేను!'' అన్నది శీలవతి.

మరి కొంతసేపటికి తోవలో తగిలిన ఒక మర్రిచెట్టు కింద రత్నాకరుడు విశ్రాంతికి కూర్చున్నాడు. శీలవతి చెట్టుకు దూరంగా వెళ్ళి కూర్చున్నది.

''పెంకిమనిషి! మూర్ఖురాలు! పెద్దవాళ్ళంటే లక్ష్యంలేదు. ఈమెను పుట్టింట వదలటం నా కొడుక్కు పీడ విరగడే!" అనుకున్నాడు రత్నాకరుడు.

తరవాత వాళ్ళు బండిలో కొంత దూరం ప్రయాణించి, ఒక గ్రామంలో ఎరిగినవాళ్ళ ఇంట భోజనంచేసి, బయట విశ్రాంతి తీసుకున్నారు. రత్నాకరుడు తాము వచ్చిన బండిలో పడుకున్నాడు. శీలవతి బండి నీడలో కూర్చున్నది.

అప్పుడు చెట్టుమీద కూర్చున్న కాకి





ఒకటి తెగ అరవసాగింది. అది విని శీలవతి, ''ఓసీ, కాకీ! ఎందుకలా అరుస్తావు? ఒక పొరపాటుచేసి నేను ఇల్లు వదిలిపెట్టవలసి వచ్చింది. ఇంకో సారి అలాచేస్తే నా భర్త ముఖం మళ్ళీ చూడలేనేమో!" అన్నది.

ఈ మాటలు విని ఆశ్చర్యపడి రత్నాకరుడు బండి దిగివచ్చి, ''నువ్వు ఇప్పు డన్నమాటకు అర్థమేమిటి?" అని కోడల్ని అడిగాడు.

''సువాసన ఉన్నందువల్లనే గంధపు చెక్కను అరగదీస్తారు. రంగు ఉండటం వల్లనే జేగురుగడ్డను చితకగొట్టి పొడి చేస్తారు. నా విశేషగుణాలే నాకు శత్రువులైనాయి. నాకు పక్షుల భాషా, జంతువుల భాషా తెలుసును," అన్నది శీలవతి.

ఆమెకు పిచ్చేమో ననుకున్నాడు రత్నాకరుడు. శీలవతి ఇంకా ఇలా చెప్పుకుపోయింది:

''కొన్నాళ్ళ క్రితం అర్ధరాత్రివేళ అడ నక్క కూసింది. నదిలో ఒక స్త్రీ శవం కొట్టుకుపోతున్నదనీ, ఆ శవంమీద ఆభరణా లున్నాయనీ నక్క అంటున్నది. అది విని నేను ఖాళీకుండ తీసుకుని నదికివెళ్ళి, శవాన్ని నీటినుండి ఒడ్డుకు లాగి, దాని ఆభరణాలు తీసి కుండలోపెట్టి, ఆ కుండను గుర్తుగా ఒకచోట పాతిపెట్టి, శవాన్ని నక్కకు వదిలి, ఇంటికి తిరిగి వచ్చాను. ఈ చిన్న తప్పు చేసినందువల్ల నేను మీ అనుమానానికి గురి అయి ఈ స్థితికి వచ్చాను."

రత్నాకరుడికి ఇదంతా విని ఆశ్చర్యమూ, కోడలిపైన జాలీ కలిగాయి. శీలవతి ఇంకా ఇలా చెప్పింది:

''అయితే నా పైన పశు పక్ష్యాదులకు ఎంత అభిమానమో చూడండి. ఆ కాకి ఇంతసేపటినుంచి నాతో చెబుతున్నది, ఆ చెట్టుకింద పెద్ద నిధి ఉన్నదని!''

వెంటనే రత్నాకరుడు ఆ చెట్టుకింద

తవ్వాడు. ధనరాశి దొరికింది. అతనికి తన కోడలుమీద అపారమైన విశ్వాసమూ, గౌరవమూ కలిగాయి. ఆయన శీలవతితో, ''నేను నిన్ను సరిగా అర్థంచేసుకోలేక పోయినందుకు విచారిస్తున్నాను. మనం ఇంటికి తిరిగి పోదాం,'' అన్నాడు.

తిరుగుప్రయాణం ఉత్సాహంగా సాగింది. దారిలో తిరిగి మర్రిచెట్టు కనబడగానే మామగారు కోడల్ని, "నువు మర్రిచెట్టు కింద ఎందుకు కూర్చోలేదు?" అని అడిగాడు.

''మర్రిచెట్టు తొర్రలలో పాము లుంటాయి. చెట్టుమీద ఉండే పక్షులు రెట్టలు వేస్తాయి,'' అన్నది కోడలు.

రత్నాకరుడు నవ్వి, "ఔను, నిజమే," అన్నాడు. తరవాత నగరం వచ్చింది.

''ఈ నగరంలో బాటసారుల సౌకర్యం కోసం ఒక్క సత్రమైనాలేదు. ఇది తేలికగా శత్రురాజుల వశమవుతుంది.'' అన్నది శీలవతి.

తరవాత విరగపండిన చేను వచ్చింది.

''యజమాని ఈ పంటను అమ్మి, డబ్బును సద్వినియోగం చేస్తేనే నిజంగా లాభం వచ్చినట్టు!'' అన్నది శీలవతి.

తరవాత వాగు వచ్చింది.

''వాగులో రాళ్ళుంటాయి, జల జంతువులు ఉంటాయి. నేలమీదలాగా అవి కనిపించవు. అందుచేత నీటిలో నడిచే టప్పుడు విధిగా పాదరక్షలుండాలి,''



అన్నది. ఆమె తెలివిని మామగారు ప్రశంసించాడు.

ఇంటికి తిరిగి వచ్చిన భార్యను చూసి అజితసేనుడు చాలా సంతోషించాడు. తన తండ్రి ఆమెకు ఇంటిపెత్తనం ఇయ్యటం చూసి, ఆమె తన తండ్రి విశ్వాసానికి పాత్రురాలయిందని అతను గ్రహించాడు.

ఆ సమయంలో ఆ దేశపురాజు మంత్రిని నియమించే ఉద్దేశంతో అనేక మంది మేధావులను రప్పించి, వారితో గోష్ఠి జరుపుతున్నట్టు జరుపుతూ పరీక్ష చేస్తున్నాడు. దానికి అజితసేనుడు తన భార్యతోసహా వెళ్ళి, రాజుగారి ధర్మ శాలలో దిగాడు.

''రాజును కాళ్ళతో తన్నినవారికి ఏమి శిక్షవెయ్యాలి?" అని అకస్మాత్తుగా రాజు మేధావులను అడిగాడు.

రాజద్రోహనేరానికి విధించే శిక్ష విధించాలనీ, కొరత వెయ్యాలనీ, శిరశ్ఛేదం చెయ్యాలనీ, ఒకరిని మించి మరొకరు రాజుగారి మెప్పుకోసం పోటీపడి చెబుతున్నారు.

అజితసేనుడు చప్పున ధర్మశాలకు పరుగెత్తి, శీలవతికి రాజుగారి ప్రశ్న చెప్పాడు. ''రాజును ఎవరు తన్నుతారు ? శృంగార చేష్టగా భార్య తన్నాలి. లేదా పిల్లలు తన్నాలి. అందుకు శిక్ష ఏమిటంటే ఏమీ శిక్ష విధించక, మరింత ప్రేమగా చూడటం !'' అన్నది శీలవతి.

అజితసేనుడు తిరిగి వచ్చేసరికి సభికులు ఇంకా శిక్షలు చెబుతూనే ఉన్నారు. అందరూ మౌనంగా ఉన్న క్షణం చూసి అజితసేనుడు, "మహారాజా, రాజును కాళ్ళతో తన్నినవారిని మరింత ప్రేమగా చూసి ఆదరించాలి," అన్నాడు.

అజితసేనుడికి మంత్రి పదవి లభించింది.

అతడు శీలవతితోసహా దివాణంలో కాపరంపెట్టి, శీలవతి సహాయంతో రాజుకు అద్భుతమైన సలహాలిస్తూ, గొప్పమంత్రి అని పేరు తెచ్చుకున్నాడు.



# పండ్ల దొంగలు

ఒక జమీందారు రకరకాల మామిడి చెట్లు దేశ దేశాలనుంచి తెప్పించి తోట వేయించాడు. కొంత కాలానికి చెట్లు ఏపుగా పెరిగి, కాయలుపడి, కోతకు వచ్చాయి.

రేపు కాయలు కోయాలనగా తోటమాలి జమీందారు దగ్గరికి వచ్చి, "దొరా, ఊరి పిల్లలు మన తోటమీద పడి, కాయలన్నీ తినేశారు," అన్నాడు.

జమీందారు మర్నాడు ఊరి పిల్లలందరినీ పిలిచి వాళ్లకు లడ్డూలు పెట్టించాడు. ఒక్కొక్కరు రెండేసి లడ్లకన్న ఎక్కువ తినలేకపోయారు.

"రెండు లడ్లు గట్టిగా తినలేని పిల్లలు తోటలో కాయలన్నీ తినేశారా?" అని జమిందారు తోటమాలిని అడిగాడు.

తోటమాలి జమిందారు కాళ్లమిదపడి క్షమాపణ చెప్పుకుని, తాను కోసిన కాయలన్నీ తెచ్చి ఇచ్చాడు.

—మారుపాక మంజురాణి





# మోసపోయిన దొంగ

పర్షియా దేశంలోని ఒక పట్టణంలో రజాక్ అనే పేదవా డుండేవాడు. అతను ఒక వర్తకుడి దుకాణంలో పని చేస్తూ, చాలీచాలని జీతంతో తన కుటుంబాన్ని పోషిస్తూండేవాడు.

ఆ పట్టణంలో ఒక గజదొంగ బయలుదేరి, పట్టణంలోనూ, చుట్టుపక్కలా దొంగతనాలు చెయ్యసాగాడు. వాణ్ణి పట్టిచ్చిన వారికి మంచి బహుమానం ఇస్తానని సుల్తాను ప్రకటించాడు.

తరవాత ఒకనాడు రజాక్ వీధినపడి తన పెళ్ళాన్ని దుమ్మెత్తిపోయసాగాడు, దారేపోతున్న నలుగురూ చేరి కారణం అడిగారు.

''నా భార్య ఎంత బుద్ధిహీనురాలో చూడండి. మా మామగారు దానికి ఒక పెట్టె పంపించి, దాన్ని సుల్తానుగారికి ఇస్తే మంచి బహుమానం ఇస్తారనీ, దానితో మమ్మల్ని సుఖంగా బతకమనీ చెప్పాడు. ఆ పెట్టెను నా కియ్యమంటే ఇయ్యనంటుంది. అదేం మనిషి ? మీరే చెప్పండి," అన్నాడు రజాక్.

ఇంతలో రజాక్ భార్య లోపలినుంచి బయటికి వచ్చి, ''మా నాన్నకు మతి లేదు. నా మొగుడికి అంతకన్న మతి లేదు. ఆ పెట్టెలో ఓ కాగితం ముక్క తప్ప లేదు. దీన్ని తీసుకుని ఈయనగారు రాజధానికి పోతాడట ! సుల్తానుగారు ఈయనకు మెచ్చి మేకతోలు కప్పుతాడట! ఆరునూరైనా నేను ఆ పెట్టెను ఇయ్యను గాక ఇయ్యను !'' అని గట్టిగా చెప్పి, లోపలికిపోయి తలుపు వేసుకున్నది.

రజాక్ వసారాలో కూర్చుని, ''ఎలా ఇయ్యవో నేనూ చూస్తాను ! నీ సంగతి నేను చూడలేననుకున్నావా?'' అన్నాడు.

ఎం. మనోహరరెడ్డి

ఈ వార్త నిమిషాలమీద దొంగకు చేరింది. వాడు వీలైతే ఆ పెట్టెను కాజెయ్యాలని రజాక్ ఇంటిని వెయ్యి కళ్ళతో కనిపెట్టసాగాడు.

రెండురోజుల అవతల రజాక్, తన భార్యను ఎలా ఒప్పించాడోగాని, పెట్టె తీసుకుని రాజధానికి బయలుదేరాడు. అతనితోబాటే దొంగకూడా బయలు దేరాడు.

ఆ రోజంతా ప్రయాణంచేసి రజాక్ ఆ రాత్రికి రాజధాని చేరుకుని, ఒక సరాయ్‌లో దిగాడు. దొంగకూడా అందు లోనే చేరాడు. ఒక మనిషి తనతోపాటే తమ పట్టణం నుంచి రావటం రజాక్ గమనించి, అతనే గజదొంగ అయి ఉండాలని నిశ్చయించుకున్నాడు. అతను తన పెట్టెను తన దగ్గిరే పెట్టుకుని పడుకుని, గాఢనిద్రలో ఉన్నట్టు గుర్రుపెట్టసాగాడు. అదే సమయమనుకుని దొంగ ఆ పెట్టెను తీసుకుని మర్నాడు ఉదయం సుల్తాను గారి దివాణానికి వెళ్ళాడు.

దొంగ తెచ్చిన పెట్టెను రాజభటులు సుల్తానుకు అందజేశారు. సుల్తాను ఆ పెట్టెను తెరిపించి చూస్తే, అందులో ఒక కాగితంమీద, "ఈ పెట్టె తెచ్చినవాడు ఫలానా పట్నంలోని గజదొంగ," అని ఉన్నది. దానికింద రజాక్ పేరూ, ఊరూ, వీధీ ఉన్నాయి.

సుల్తాను దొంగను విచారణ జరిగే దాకా ఖైదులో ఉంచమని ఉత్తరు విచ్చాడు. ఇది కళ్ళారా చూసి రజాక్ సుల్తాను దర్శనం సంపాదించి, దొంగను పట్టిచ్చినది తానేననీ, తాను చాలా పేద వాడిననీ చెప్పుకున్నాడు.

దొంగ ఉండే ఇల్లు సోదా చేయించిన మీదట చాలామంది పోగొట్టుకున్న వస్తువులు దొరికాయి. దొంగకు సుల్తాను కారాగారశిక్ష విధిస్తూ, అతన్ని పట్టిచ్చిన రజాక్‌కు వెయ్యి బంగారు దీనారాలు బహుమతి ఇచ్చాడు. ఆ డబ్బుతో రజాక్ సొంతాన వ్యాపారం ప్రారంభించి, సుఖంగా జీవించాడు.





# మనుషులు చేసిన దేవుళ్ళు

ఒక మహాయోగి అద్భుత శక్తి సంపన్నుడు. ఆయన దేశసంచారం చేస్తూ, శక్తులు ఉడిగిపోయిన దేవుళ్ళకు చైతన్యం గలిగిస్తూ, శిథిలమైన దేవాలయాలను పునరుద్ధరిస్తుండేవాడు. ఆయన ఒక గ్రామం సమీపంలో పాడుబడిన గ్రామదేవత గుడి చూసి, ఆ గ్రామదేవతకు చైతన్యం కలిగించి, తన దారిన తాను పోయాడు.

వెంటనే ఆ గ్రామదేవత గ్రామాధికారికి కలలో కనిపించి, తాను గ్రామదేవతననీ, గ్రామస్థులు తనను చాలా కాలం నిర్లక్ష్యం చేశారనీ, వాళ్ళంతా వచ్చి తనను క్షమాభిక్ష కోరకపోతే, గ్రామం యావత్తూ బుగ్గిచేస్తాననీ బెదిరించింది.

ఆ గ్రామాధికారి వట్టి నాస్తికుడు. దేవతలనూ, దయ్యాలనూ లక్ష్యపెట్టే తత్వం గలవాడు కాదు. అందుచేత గ్రామదేవత అన్న విషయం ఊరిలో ఎవరికీ చెప్పక ఊరుకున్నాడు.

నిజానికి, గ్రామాన్ని నాశనంచేసే శక్తి గ్రామదేవతకు లేదు. గ్రామాధికారి తన మాటలకు బెదరడని గ్రహించి, అతన్ని నయాన దారికి తీసుకురావాలనుకున్నది.

ఈ సమయంలో, ఆ ఊళ్ళో ఉండే జోగిశెట్టి అనే వైశ్యుడి ఇంట దొంగలు పడి, చేతికి చిక్కినదల్లా దోచుకుపోయారు. అతను, అసలే పిసినారి. లబోదిబో మంటూ గ్రామాధికారి ఇంటికి వెళ్ళి, తన ఇల్లు దోపిడైపోయినదంటూ మొరపెట్టుకున్నాడు.

ఈసారి గ్రామదేవత మళ్ళీ గ్రామాధికారి కలలోకి వచ్చి, జోగిశెట్టి ఇంట పోయిన సరుకు ఎక్కడ దాచి ఉన్నదో

పిరేపల్లి జయరాంరెడ్డి

చెప్పి, ఇప్పుడైనా తన మహిమ గుర్తించక పోతే, నాశనమై పోగలవని హెచ్చరించింది.

గ్రామాధికారి చడీ, చప్పుడూ లేకుండా, ఒక్కడే వెళ్ళి, ఆ సొత్తు అంతా తెచ్చుకుని, తన ఇంట ఉంచుకున్నాడు.

దాంతో గ్రామదేవతకు ఒళ్ళుమండి, "శెట్టి సొమ్ము శెట్టికి అప్పగించకుండా నువు కాజేస్తావా ? చూడు, నిన్ను ఏం చేస్తానో," అన్నది.

గ్రామాధికారి దణ్ణంపెట్టి, "తల్లీ, కోప్పడకు. ఆ జోగిశెట్టి ఉత్త లోభి. ఈ సొత్తు వాడి ఇంట ఉన్నా, భూమిలో ఉన్నా ఒకటే. ఈ సొమ్ము గుప్తదానాల కింద వినియోగిస్తాను. నువు చేసిన సహాయానికి ప్రత్యుపకారంగా నీ కోరిక తీర్చుతాను," అన్నాడు.

ఇద్దరూ చాలాసేపు మాట్లాడుకుని, ఎలాగైతేనేం, చివరకు ఒక ఒప్పందానికి వచ్చారు.

మర్నాడు గ్రామాధికారి రచ్చబండ చేరి, రాత్రి కలలో తనకు ఒక దేవత కనిపించి, ఏకాదశినాడు ఊరికి ఉత్తరాన కొబ్బరితోపులో భూమిలోనుంచి తాను పుట్టబోతున్నానని చెప్పిందని ఊళ్ళో వాళ్ళతో అన్నాడు.



నమ్మినవాళ్ళూ, నమ్మనివాళ్ళూ ఏకాదశిరోజున కొబ్బరితోపులో గుమికూడారు. అందరూ చూస్తూండగానే గ్రామదేవత విగ్రహం భూమి నుంచి పైకి వచ్చింది.

ఆ అద్భుతంచూసి, అక్కడ చేరిన జనం బిత్తరపోయి, భయభక్తులతో దేవతకు సాగిలబడి, మొక్కులు మొక్కుకోసాగారు.

ఇదంతా చూసేసరికి గ్రామాధికారికి ఒక ఆలోచన తట్టింది. ఆ రాత్రి దేవత మళ్ళీ తనకు కలలో కనబడగానే గ్రామాధికారి, "తల్లీ, నీ మీద జనానికి భక్తి కుదిరింది. ఇంక ఏమి ఇయ్యమన్నా

ఇస్తారు. చందాలు పోగుచేసి, నీకు కొత్త గుడి కట్టించి, నగలు చేయిస్తాను, సెలవా ?'' అని అడిగాడు.

గ్రామాధికారి మారినందుకు సంతోష పడి, దేవత సరేనన్నది.

గ్రామాధికారి దేవతను గురించి ఆకాశం అంత ఎత్తు పొగడి, ఊళ్ళో చందాలు పోగుచేసి, దేవతకు చిన్న గుడి ఒకటి కట్టించి, కంసాలిచేత నగలు చేయించి, దేవతను అలంకరింపజేశాడు. అన్నమాట నిలుపుకున్నందుకు దేవత అతన్ని మెచ్చుకున్నది.

కాని ఆ రోజు రాత్రి చీకటి పడ్డాక, కంసాలి గుడికి వచ్చి, దేవత ముందు సాష్టాంగపడి, "అమ్మా, పొట్ట కూటి కోసం, గ్రామాధికారి చెప్పినట్టు, నీకు గిల్టు నగలు చేసిపెట్టాను. జనాన్ని మోస గించినా, జగన్మాతవైన నిన్ను మోసగించ లేనుగదా ! ఈ నా తప్పు కాయి, తల్లీ!'' అని వేడుకుని వెళ్ళిపోయాడు.

సొమ్మసిల్లినంత పని అయింది దేవతకు.

మరుక్షణం ఆమె కళ్ళ నిప్పులు రాల్చుతూ గ్రామాధికారికి కనబడి, ''మూర్ఖుడా ! వెర్రిజనానికి మాయ మాటలు చెప్పినట్టు, నన్నూ మోసం చేద్దామనుకున్నావా ? నీకు పుట్టగతులు లేకుండా చేస్తాను," అన్నది.

గ్రామాధికారి నిబ్బరంగా నవ్వి, ''తల్లీ, నోరులేని దేవతవు ! నా మూలంగా పేరులోకి వచ్చావు. నన్ను నువ్వేం చేయగలవు ? నేనేం తప్పు చేశాను ? నిస్వార్థంగా ఎవరూ ఏ పనీ చెయ్యరు. ధర్మకర్తలు దేవుళ్ళకు గుళ్ళు ఎందుకు కట్టిస్తారు ? మోక్షం కోసం ! అలాగే మిమ్మల్ని కొలిచేజనం తమ కోరికలు తీర్చమని మొక్కుతారు. మీ పూజార్లు కూడా జరుగుబాటు ఉంటేనే మీ సేవలు చేస్తారు. నేనూ నీ మూలాన కొంత బాగుపడ్డాను. ఇంకా నా సహా యానికి నువే నాకు కాస్త పుణ్యం బాకీ ఉన్నావు," అన్నాడు.

గ్రామాధికారి మాటలు విని, అవాక్కయిపోయింది గ్రామదేవత.





గోలకొండ నవాబు సపరివారంగా వేట కోసం అరణ్యంలోకి చాలా దూరం వెళ్ళాడు. మధ్యాన్నం దాటింది. మనుషులూ, గుర్రాలూ దాహబాధతో సతమతమవుతున్నారు.

భటులు నీటికోసం అన్ని ప్రాంతాలా గాలించారు. కాని ఎవరికీ నీటి జాడ కనబడలేదు. నవాబు తన వెంట వచ్చిన వాళ్ళ మీద మండిపడ్డాడు.

"ఆ కనపడే గుట్ట ఎక్కి ఎటుపక్కన అయినా నీటి జాడలు కనిపిస్తాయేమో, చూడండి," అన్నాడు నవాబు.

భటులు ఆయాసపడుతూ కొండ ఎక్కిచూస్తే ఒకపక్క లోయలో గుబురుగానూ, వరుసలలోనూ చెట్లూ, వాటిమీద ఎగురుతున్న పక్షులూ కనిపించాయి. ఆయన తన గుర్రాన్ని వేగంగా అటుగా నడిపించాడు.

అక్కడ ఒక తోట ఉన్నది. ఒక సాధువు ఆ తోటలోని చెట్లకు నీళ్లుపోస్తూ కనిపించాడు. ఆ సాధువుకు మిగతా ప్రపంచం గురించి తెలియకపోవటంచేత, ఆ వచ్చినవాడు నవాబు అని తెలియ లేదు; ఎవరో బాటసారి దారితప్పి వచ్చి ఉంటాడనుకున్నాడు. కాని అతను ఆ ప్రాంతానికి ప్రభువని తెలుసుకుని, నవాబును ఒక చెట్టు నీడన కూర్చోబెట్టి, ఆదరించాడు.

ఒక భటుడు పెద్ద అకుదొన్నెలో నీరు తెచ్చి నవాబుకిచ్చాడు. ఆ నీరు కొంకాయ పాలలాగా ఎంతో రుచిగా ఉన్నది. దాహ బాధ తీరిన నవాబు దృష్టి అక్కడ ఉన్న దానిమ్మ చెట్ల మీద పడింది. అతి విచిత్రంగా ఆ చెట్లకున్న దానిమ్మకాయలు కొంకాయల ప్రమాణంలో ఉన్నాయి. అంత పెద్ద దానిమ్మపళ్ళను నవాబు

వి. యజ్ఞరామయ్య

ఎన్నడూ చూడలేదు.

నవాబు వాటిని చూసి మెచ్చుకునే సరికి, సాధువు ఒక పండు కోసి, దాని రసం ఒక పాత్రలో పిండి, నవాబుకు ఇచ్చాడు. ఒక్క పండులోనుంచి అంత రసం రావటమూ, అది అమృతంలాగా ఉండటమూ చూసి నవాబుకు ఆనందంతో బాటు రకరకాల ఆలోచనలు కూడా వచ్చాయి.

ఆ తోట మీద సాధువుకు మంచి రాబడి వస్తూండాలి! రాబడికి తగిన పన్ను అతను చెల్లిస్తున్నాడో, లేదో?

అయన ఇలా అనుకుంటూ మరొక దానిమ్మపండు రసం పిండి ఇయ్యమని సాధువును కోరాడు. సాధువు అలాగే చేశాడు. కాని ఈ సారి రసం మొదటి దానిలో సగమే ఉన్నది.

"రెండో పండు మొదటిదానంత పెద్దదిగా ఉన్నప్పటికీ అందులో రసం సగమే ఉన్నదేం?" అని నవాబు సాధువును అడిగాడు.

"సర్కారు వారు మన్నించాలి! మొదటి పండు రసం తాగినవారూ, రెండో పండు రసం తాగినవారూ ఒకరు కారేమో!" అన్నాడు సాధువు.

"అరె, రెండూ తాగినవాణ్ణి నేనేకద!" అన్నాడు నవాబు.

"ఆ మాట నేను నమ్మలేను సర్కార్! పళ్లు అక్రమ తీర్పు చెప్పవు. మీరే ఆలోచించండి. మీలో ఏదో మార్పు కలిగి ఉండాలి," అన్నాడు సాధువు.

నవాబుకు తల కొట్టినట్టయింది. సాధువు పడుతున్న శ్రమను మెచ్చుకోక, అతన్ని పీడించాలనే ఆలోచన తనకు కలిగింది. దాని ఫలితమే దానిమ్మ పండులో కనిపించి ఉండాలి! పాలకుల దుర్బుద్ధులను ప్రకృతి కూడా ఏవగించుకుంటుంది కాబోలు!

నవాబు రాజధానికి తిరిగి వెళుతూనే తోటల పైన వేస్తూ వచ్చిన పన్నులను రద్దు చేసి, ఫలవృక్షాల పెంపకానికి ప్రోత్సాహం కలిగించాడు.





# వీర హనుమాన్

రాముడు సీతతో కోపంకొద్దీ ఇంత పరుషంగా మాట్లాడేసరికి, వింటున్న వాళ్ళకు భయమూ, జలదరింపూ కలిగాయి. ఎన్నడూ ఇలాటి మాటలు పడి ఎరగని సీత వంచిన తలను మరింతగా వంచుకుని, అంతమంది మధ్య జరిగిన అవమానానికి కన్నీరు కార్చింది.

ఆమె కన్నీరు తుడుచుకుంటూ డగ్గుత్తికతో, "వీరుడా, ఎందుకు ఇలాటి మాటలు అంటున్నావు? అవి అజ్ఞాని అయినవాడు తనకు తెలియనిదాన్ని గురించి మాట్లాడే మాటలు. నేను వినటానికి యోగ్యమైనవి కావు. నువు అనుకుంటున్నట్టు నేను చెడిపోలేదు. కావలిస్తే తగిన పరీక్ష ఏదైనా పెట్టు. స్త్రీలలో చెడ్డవాళ్ళు ఉన్నారుగదా అని స్త్రీలందరినీ చెడ్డవాళ్ళుగా భావించకు. నా స్వభావం నీకు బాగా తెలిసి ఉన్నట్టయితే నా మీద అనుమానం విడిచిపెట్టు. రావణుడు నన్నెత్తుకుపోయినప్పుడు వాడి శరీరం నాకు తగిలితే అది నా అసహాయతవల్ల జరిగినది కాబట్టి ఆ తప్పు దైవానిది, నాది కాదు. నా అధీనంలో ఉండిన నా మనసు మాత్రం నీ మీదనే ఉన్నది. ఇంతకాలం కలిసి ఉన్న తరవాత నా స్వభావం నీకు తెలియకపోతే, నీకు అది మరి ఏ విధంగానూ తెలిసే అవకాశం లేదు. నన్ను విడిచిపెట్టదలచినవాడివైతే నన్ను వెదకటానికి హనుమంతుణ్ణి ఎందుకు పంపావు? నన్ను విడిచి

37. సీత అగ్నిప్రవేశం



పెట్టినట్టు ఆ హనుమంతుడి ద్వారా కబురు చేసినా, హనుమంతుడు చూస్తూండగానే ప్రాణాలు విడిచి ఉండేదాన్ని. నీకు ఈ యుద్ధం చేసే అవసరం కూడా లేక పోను. నీ మిత్రులు ఇంతదూరం రావలసిన శ్రమ కూడా తప్పి ఉండును," అన్నది.

'తరవాత ఆమె లక్ష్మణుడితో, "లక్ష్మణా, నా బాధకు విరుగుడుగా చితిని పేర్చు. అందులో పడి ప్రాణాలు విడుస్తాను. ఇంతమాట పడి బతికి ఉండటం నా కిష్టంలేదు. ఇంతమంది ఎదట నా భర్త నన్ను వదిలేస్తే అగ్ని ప్రవేశం తప్ప నాకు వేరే గతి ఏమున్నది?" అన్నది.

ఈ మాటకు ఎంతో నొచ్చుకుంటూ లక్ష్మణుడు రాముడి ముఖం కేసి చూశాడు. రాముడి వాలకం చూస్తే సీత అగ్నిప్రవేశం చెయ్యటం అతనికి అభ్యంతరం లేనట్టు కనబడింది. అందుచేత లక్ష్మణుడు సీత కోరిన ప్రకారం చితి పేర్చాడు.

చితి బాగా మండుతున్నది. తల వంచుకున్న రాముడి చుట్టూ ప్రదక్షిణం చేసి, సీత చితిని సమీపించింది. ఆమె చేతులు మోడ్చి, "నా మనసు రాముడి మీద తప్ప మరొక పురుషుడి మీదికి పోదన్నమాట నిజమైతే ఈ అగ్నిహోత్రుడు నన్ను కాపాడుగాక! సూర్యుడూ, వాయువూ, దిశలూ, చంద్రుడూ, పగలూ, రాత్రీ, ఉభయ సంధ్యలూ, భూమీ, ఇతర దేవతలూ నేను పతివ్రతనని ఒప్పుకున్న పక్షంలో అగ్నిహోత్రుడు నన్ను రక్షించుగాక!" అని, చితికి ప్రదక్షిణం చేసి, మండుతున్న చితిలో ప్రవేశించింది.

ఇది చూసి అక్కడ చేరిన వారందరూ హాహాకారాలు చేశారు. రాముడు కళ్ళ వెంట నీరు కార్చుతూ విచారంగా ఉండిపోయాడు.

అంతలోనే చితి చెల్లాచెదరైపోయింది. దానిలోనుంచి అగ్నిహోత్రుడు మనిషి

రూపంలో సీతను ఎత్తుకుని ఇవతలికి వచ్చాడు. సీత ముందులాగే నగలు ధరించి, ఎర్ర చీర కట్టుకుని, నొక్కు నొక్కుల నల్లని జుట్టుతో, ఏ మాత్రమూ కందిపోకుండా ఉన్నది.

అగ్నిహోత్రుడు రాముడితో, "రాముడా, ఇదుగో నీ భార్య అయిన సీత! ఈమె ఏ పాపమూ ఎరగదు. ఈమె నిన్ను తప్ప మరొక పురుషుణ్ణి తలవలేదు. రావణుడు ఈమెను తన అంతఃపురంలో ఉంచి, భయంకర రాక్షస స్త్రీలను కాపుపెట్టి, ఎన్నో ఆశలు పెట్టాడు, ఎన్ని విధాలనో బెదిరించాడు. అయినా ఆమె రావణుణ్ణి తలచనేలేదు. ఈ సీతను పరిగ్రహించి ఏలుకో. ఇది నా ఆజ్ఞ!'' అన్నాడు.

అగ్ని ఇలా చెప్పినందుకు రాముడు చాలా తృప్తిపడ్డాడు; అలాటి దాన్ని అవమానించి, అగ్నిప్రవేశం చేయించినందుకు చాలా విచారించి, కన్నీరు కార్చాడు. అతను అగ్నిహోత్రుడితో ఇలా అన్నాడు: ''సీతలో ఏ పాపమూలేనిమాట నిజమే. అయితే ఆమె రావణుడి ఇంట చాలాకాలం ఉన్నది. నేను సీతను పరీక్షించకుండా స్వీకరించి ఉంటే, లోకులు, 'దశరథ మహారాజు కడుపున పుట్టిన ఈ రాముడు మూఢుడూ, కాముకుడూను! అంతేగాని ధర్మం తెలిసినవాడు కాడు,'



అని ఉందురు. అయితే మూడులోకాలకూ నిజం తెలియగలందులకు, సీత అగ్ని ప్రవేశం చేస్తూంటే చూస్తూ ఊరుకున్నాను. ఆమెకు నా యందే ప్రేమ అని తెలియక కాదు. మీ ఆజ్ఞ తప్పక శిరసావహిస్తాను,'' అన్నాడు.

అ సమయంలో స్వర్గం నుంచి దశరథుడు దివ్య విమానంలో అక్కడికి వచ్చాడు. ఆయనను చూసి రామ, లక్ష్మణులు నమస్కారం చేశారు. దశరథుడు తన ప్రియపుత్రుడైన రాముణ్ణి కౌగిలించుకుని ఇలా అన్నాడు:

''నాయనా, రామా! నిన్ను విడిచి ఉండటంచేత నాకు ఈ స్వర్గసుఖాలూ,



దేవర్షులు నాకు చూపించే గౌరవమూ ఆనందం కలిగించలేక పోయాయి. శత్రువులను చంపి, వనవాసదీక్ష పూర్తి చేసిన నిన్ను చూస్తే నాకు పరమానందగా ఉన్నది. నిన్ను అడవికి పంపమని కైకేయి కోరిన కోరిక ఇంకా నా మనస్సును వేధిస్తూనే ఉన్నది. రావణుణ్ణి నువు చంపటం కోసం దేవతలే నీ పట్టాభిషేకానికి విఘ్నం కలిగించారని నాకిప్పుడు తెలిసింది. నువు వనవాసం మాని ఇంటికి తిరిగి వెళ్ళగానే కౌసల్య సంతోషిస్తుంది. నువు వెళ్ళి పట్టాభిషేకం చేసుకో. రాజ్యపాలన చేస్తూ నీ తమ్ములతో సహా సుఖంగా ఉండు.''

రాముడు చేతులుజోడించి దశరథుడితో ఇలా అన్నాడు: ''నన్ను వనవాసానికి పంపమనే పక్షంలో కైకేయినీ, భరతుణ్ణీ విడిచిపెట్టుతానన్నావు. ఇప్పుడు వాళ్ళ మీద అనుగ్రహం చూపించు.''

దశరథుడు అందుకు ఒప్పుకుని, లక్ష్మణుణ్ణి కౌగలించుకుని, అతను రాముడికి చేసిన సేవలను ప్రశంసించాడు. తరవాత అయన సీతతో, ''రాముడు నిన్ను విడిచిపెట్టుతానన్నందుకు కోపగించుకోకు,'' అని చెప్పి, స్వర్గానికి తిరిగి వెళ్ళిపోయాడు.

తరవాత ఇంద్రుడు రాముడి ముందుకు వచ్చి, ఏదైనా వరం కోరుకోమన్నాడు. తన కోసం ప్రాణాలర్పించిన వానరులందరూ తిరిగి బతికేలాగు చెయ్యమని రాముడు ఇంద్రుణ్ణి కోరాడు. ఇంద్రుడు అందుకు సమ్మతించాడు. యుద్ధరంగంలో అవయవాలూ, తలలూ తెగి, చచ్చి పడి ఉన్న వానరులూ, భల్లూకాలూ చెక్కు చెదరకుండా బతికి లేవటం చూసి, బతికి ఉన్నవాళ్ళు ఆశ్చర్యపడ్డారు.

ఆ రాత్రి గడిచి తెల్లవారగానే విభీషణుడు రాముడి కోసం స్నానానికి పనికివచ్చే నీరూ, సుగంధలేపనాలూ, బట్టలూ తెచ్చి, రాముడి చేత స్నానం చేయించటానికి స్త్రీలను కూడా తెచ్చాడు.

రాముడు విభీషణుడితో, "సుగ్రీవుడు మొదలైన వానర వీరులను స్నానానికి పిలు. నేను వెంటనే అయోధ్యకు పోవాలి. పధ్నాలుగేళ్ళూ నిండిన మర్నాడు నేను కనిపించకపోతే అగ్నిప్రవేశం చేస్తానని శపథం చేసిన భరతుణ్ణి చూడటం కన్న నాకు ఈ స్నానం వగైరా ముఖ్యం కాదు," అన్నాడు.

దానికి విభీషణుడు, "రామా, నిన్ను ఒక్క రోజు లోపల అయోధ్యకు చేర్చ గలను. కుబేరుడి నుంచి రావణుడు బలాత్కారంగా సంగ్రహించిన పుష్పక విమానం ఉన్నది. నీకూ, సీతకూ, లక్ష్మణుడికీ నేను చేసే సత్కారాలన్నీ స్వీకరించమని నా ప్రార్థన," అన్నాడు.

దానికి రాముడు, "విభీషణా, నువు యుద్ధంలో నాకు సహాయపడటమే నాకు గొప్ప సత్కారం. నా కోసం చిత్రకూట పర్వతానికి వచ్చిన భరతుణ్ణి చూడాలని నా మనసు చాలా తొందరపడుతున్నది. అంతేగాక మా తల్లులైన కౌసల్యనూ, సుమిత్రనూ, కైకేయినీ, గురువులైన వసిష్ఠుడు మొదలైన వారినీ, స్నేహితులనూ, నగరవాసులనూ చూడాలని కూడా తొందరగా ఉన్నది. అందుచేత వెంటనే పుష్పక విమానం తెప్పించు. నేనిక్కడ ఒక్క క్షణం కూడా ఉండ



లేను. వెంటనే నేను వెళ్ళిపోవటానికి అనుజ్ఞ ఇయ్యి," అన్నాడు.

వెంటనే విభీషణుడు పుష్పక విమానాన్ని తీసుకు వచ్చాడు. పూలమాలలతో అలంకరించి ఉన్న ఆ విమానాన్ని రాముడికి చూపి, "ఇంక ఏమి సెలవు?" అని అడిగాడు.

"వానరులు చేసిన సహాయం ఇంతా, అంతా కాదు. వారికి బట్టలూ, నగలూ మొదలైనవి ఇచ్చి సత్కరించు. దేవతలకు లొంగని ఈ లంకానగరం వానరుల ధర్మమా అంటూ మనకు లొంగింది. వారి శ్రమకు తగిన ప్రతిఫలం చూపించు. వారికి నీ కృతజ్ఞత చూపితే వాళ్ళు



సంతోషిస్తారు,'' అని రాముడు విభీషణుడికి చెప్పాడు.

విభీషణుడు ఆ ప్రకారమే వానర వీరులనందరినీ సత్కరించాడు. తరవాత రాముడు సీతను వెంటబెట్టుకుని పుష్పక విమానం ఎక్కాడు. వాళ్ళ వెనకగా లక్ష్మణుడు కూడా ఎక్కాడు. తరవాత రాముడు వానరులతోనూ, సుగ్రీవ విభీషణులతోనూ, ''మీరు నాకు కార్యసిద్ధి కలిగించారు. ఇక మీరు మీ ఇష్టం వచ్చిన చోటికి పోవచ్చునని నేను అనుమతిస్తున్నాను. సుగ్రీవుడా, నువు బంధువుగానూ, మిత్రుడుగానూ ఎంత చెయ్యవచ్చునో అంతా చేశావు. నువు నీ సేనలతో కిష్కింధకు తిరిగిపోయి, సుఖంగా ఉండు. విభీషణా, నేను నీకిచ్చిన లంకా రాజ్యాన్ని సుఖంగా ఏలుకో. దేవతలు కూడా నిన్ను ఎదిరించలేరు. నేనిక అయోధ్యకు పోతాను, మీరు అనుమతించండి,'' అన్నాడు.

అప్పుడు సుగ్రీవుడు మొదలైన వానరులూ, విభీషణుడూ రాముడితో, ''మాకు కూడా అయోధ్యకు రావాలని ఉన్నది. మమ్మల్ని కూడా తీసుకుపో. అక్కడి ప్రజలకు మా వల్ల ఏ బాధా లేకుండా అరణ్యంలోనూ, నగరంలోనూ సంచరిస్తాం. మేం నీ పట్టాభిషేకం చూసి, కౌసల్యాదేవికి నమస్కరించినాకనే మా ఇళ్ళకు పోతాం,'' అన్నారు.

''మీరంతా నా వెంట వస్తామంటే నాకు మరీ సంతోషం. సుగ్రీవా, నువూ, నీ వానరులూ వెంటనే పుష్పకంలోకి రండి. విభీషణా, నువూ, నీ మంత్రులూ కూడా రండి,'' అన్నాడు రాముడు.

సుగ్రీవుడి వెంబడి వానరులూ, విభీషణుడి వెంట అతని మంత్రులూ ఎక్కగానే పుష్పక విమానం ఆకాశంలోకి లేచింది. అది వాయువేగంతో ఆకాశంలో పోతూ ఉంటే, రాముడు సీతకు త్రికూట పర్వతం మీద ఉన్న లంకా నగరాన్ని, రక్తంతో తడిసిన

యుద్ధభూమినీ, తాను రావణుణ్ణి చంపిన స్థలాన్నీ, కుంభకర్ణుణ్ణి చంపిన స్థలాన్నీ, సముద్రాన్నీ, సేతువునూ, విభీషణుడు మొట్టమొదట తన వద్దకు వచ్చిన ప్రదేశాన్నీ, కిష్కింధా నగరాన్నీ, తాను వాలిని చంపిన స్థలాన్నీ చూపాడు.

సీత రాముడితో, "నేను అయోధ్య ప్రవేశించేటప్పుడు నా వెంట సుగ్రీవుడి భార్యలైన తార మొదలైన స్త్రీలనూ, ఇతర వానర ప్రముఖుల భార్యలనూ తీసుకుపోవాలని కోరుతున్నాను," అన్నది.

రాముడు పుష్పకాన్ని కిష్కింధలో ఆపి, సుగ్రీవుడితో, "మీ భార్యలందరూ తన వెంట అయోధ్యకు రావాలని సీత కోరుతున్నది. ఆ మాట మీ ఆడవారందరికీ చెప్పు," అన్నాడు.

సుగ్రీవుడు తార దగ్గిరికి పోయి, "నిన్నూ ఇతర వానర స్త్రీలనూ అయోధ్యకు తీసుకురమ్మని రాముడి ఆజ్ఞ. సీతాదేవి అలా కోరిందట. వెంటనే బయలుదేరండి," అన్నాడు.

తార ఆపాదమస్తకమూ అలంకరించుకుని, మిగిలిన వానర స్త్రీలతో, "మనమందరమూ అయోధ్యకు పోయి, అక్కడి విశేషాలు చూసి వద్దాం, బయలుదేరండి," అన్నది. వానర స్త్రీలు అలంకరించుకుని, సీతను చూడాలన్న కుతూహలంతో తార వెంట బయలుదేరి, పుష్పక విమానంలో ఎక్కారు. తిరిగి విమానం ఆకాశంలో ప్రయాణం సాగించింది. రాముడు సీతకు ఋశ్యమూక పర్వతాన్నీ, తాను సుగ్రీవుణ్ణి మొదట కలుసుకున్న స్థలాన్నీ, పంపాసరస్సునూ, సీతను పోగొట్టుకుని తాను ఏడ్చిన ప్రాంతాన్నీ, కబంధుణ్ణి చంపిన స్థలాన్నీ, ఇతర ప్రదేశాలనూ చూపాడు.

విమానం అత్రి మహర్షి ఆశ్రమం మీదుగానూ, గుహుడు ఉండే శృంగిబేరపురం మీదుగానూ, చిత్రకూటం మీదుగానూ, భరద్వాజాశ్రమం మీదుగానూ ఎగురుతూ, అయోధ్యానగరాన్ని చేరవచ్చింది.





# సింహగఢ్ విజయం

సహ్యాద్రి పర్వత శ్రేణుల్లోని, ఒక శిఖరం మీద సింహగఢ్ దుర్గం నిర్మించబడింది. ఆ దుర్గాన్ని మహారాష్ట్రుల నుంచి, మొగలులు ఆక్రమించుకున్నారు. మొగలుల సేవలో వున్న ఉదయభాను అనే రాజపుత్ర సేనాని, పెద్ద సేనతో దుర్గరక్షణకు నియమించబడ్డాడు.



చరిత్ర ప్రసిద్ధుడైన మరాటా నాయకుడు శివాజీ ప్రతాప్‌ఘర్ దుర్గంలో నివసిస్తూండేవాడు. శివాజీ తల్లి అయిన జీజాబాయ్ ఒకనాటి ఉదయవేళ పూజ ముగించి, కిటికీ దగ్గిరకు వచ్చి నిలబడింది. దూరంగా సింహగఢ్ దుర్గం కంటబడగానే ఆమెకు చప్పున ఒక ఆలోచన కలిగింది.



శివాజీ కొంతకాలంగా ఆరోగ్యం సరిలేక, విశ్రాంతి తీసుకుంటున్నాడు. ఆ రోజు సాయంత్రం శివాజీ కాలక్షేపం కోసం తనతో చదరంగం ఆడవచ్చినప్పుడు ఆమె, "నాయనా, ఆటలో నువ్వు ఓడటం జరిగితే, నా కెలాంటి బహుమానం యిస్తావు?" అని అడిగింది. "అమ్మా, నువ్వు కోరిన బహుమానం!" అన్నాడు శివాజీ.

శివాజీ ఆటలో ఓడాడు. "అమ్మా, నీకేం బహుమానం కావాలో చెప్పు?" అన్నాడతడు. జీజాబాయ్ గంభీరంగా ముఖం పెట్టి, "నాయనా, నాకు సింహగడ్ దుర్గం కావాలి!" అన్నది. ఆ జవాబుకు అంత శక్తిమంతుడైన శివాజీ కూడా నిర్విణ్ణుడయాడు. సింహగడ్ అంత తేలిగ్గా లభ్యమయే బహుమానం కాదు!





అయినా, తల్లి కోరిన బహుమానం యివ్వగలనని శివాజీ మాట యిచ్చి వున్నాడు! ఆ దుర్గంపై దాడి చేయగల ధైర్యశాలి ఒకే ఒకడున్నాడు; అతడు తానాజీ మాలుసరే. శివాజీ అతడి కోసం కబురంపాడు. తన కుమారుడి వివాహ వేడుకల్లో వున్న తానాజీ వెంటనే బయలుదేరి వచ్చాడు.

శివాజీ తన తల్లి కోర్కె గురించి తానాజీకి చెప్పాడు. తానాజీ నిస్సంకోచంగా అప్పటికప్పుడే మెరికల్లాంటి వేయిమంది సైనికుల్ని వెంటబెట్టుకుని, కారుచీకటిలో, జడివానను కూడా లెక్క చేయకుండా సింహగడ్ కేసి బయలుదేరాడు.





దుర్గం కాపలావాళ్ళు నిద్రమత్తులో వున్నారు. తానాజీ తన సైనికులను దుర్గం వెనక భాగాన సమాయత్తం చేశాడు. తరవాత మంచి శిక్షణ పొందిన శివాజీ పెంపుడు ఉడుము యశ్వంతి నడుముకు తాడుకట్టి, దాన్ని దుర్గం రాళ్ళ పైకి వదిలాడు. అది పాకుతూ పై భాగాన్ని చేరి, అక్కడ వున్న ఒక చెట్టుకు తాడును చుట్ట బెట్టింది.



ఆ తాడు ఆధారంతో తానాజీ సైనికులు నిశ్శబ్దంగా పైకి పోయారు. అలా మూడువందలమంది మరాటా సైనికులు దుర్గంలో ప్రవేశించినా, కాపలావాళ్ళు యింకా ఆదమరిచి నిద్రపోతూనే వున్నారు.



హఠాత్తుగా మరాటా సైనికుల్లో ఒకడు తాడు పట్టు జారి, దభీమంటూ కింద పడ్డాడు. ఆ ధ్వనికి కాపలా వాళ్ళు మేల్కొని, దుర్గంలోని తమవాళ్ళను హెచ్చరించారు. కాని, యీ లోపలే తానాజీ సైనికులు కొందరు దుర్గ ద్వారాన్ని చేరి, తలుపులు తెరిచారు.

దుర్గాన్ని రక్షిస్తున్న మొగల్ సైనికులు, తానాజీ వెంట వున్న మరాటా సైనికులను ఎదుర్కొన్నారు. వాళ్ళు, చంద్రావళి అనే ఒక మదపుటేనుగును, మరాటా సైనికుల పైకి ఉసికొల్పారు. తానాజీ ఒక్క ఊపున పోయి మదపు టేనుగుపై కూర్చుని, దాన్ని మొగల్ సైనికుల మధ్యకు పరిగెత్తించి, వాళ్ళను భీతావహులను చేసి, తరవాత దాన్ని చంపివేశాడు.





మరాటా సైనికుల్లో యింకా ఏడు వందలమంది దుర్గం దిగువనే వున్నారు. దుర్గాన్ని రక్షిస్తున్న అసంఖ్యాకులైన అరబ్బీ, ఆఫ్ఘన్, పఠాన్, రాజపుత్ర సైనికుల్ని, తానాజీ తన వెంట వున్న మూడు వందల మంది సైనికులతో ఎదుర్కోవలసి వచ్చింది. అయినా, అతడు ఎంతో ధైర్య సాహసాలతో, చాకచక్యంతో పోరాడి సింహగఢ్ దుర్గాన్ని వశపరుచుకోగలిగాడు.

శత్రువులతో జరిపిన యీ భీకర పోరాటంలో, సింహవిక్రముడైన తానాజీ బాగా గాయపడి, త్వరలోనే మరణించాడు. శివాజీ అతడి మృత దేహాన్ని చూసినప్పుడు, దుఃఖవివశుడై పోయి, "గఢ్ (దుర్గం) లభించింది; కాని సింహం పోయింది!" అన్నాడు.



# కథా శీర్షిక పోటీ

## ఈ కథకు మంచి పేరు పెట్టి రు 25 లు గెలవండి!

## ?

రాజుగారి ఆస్థానకవికి సోమశేఖరుడు అనే కొడుకు ఉండేవాడు. మంచి తెలివిగలవాడు కావటంచేత అతను చిన్నతనంలోనే మంచి పండితుడుగా తయారయాడు. అయితే ఒకనాడు అతను ఇద్దరు యోధులు కత్తిసాము చేస్తూండటం చూసి, ఎంతో ముచ్చటపడి, శుష్క పాండిత్యం కన్న కత్తిసాములో అందమూ, పౌరుషమూ ఉన్నట్టు తోచి, రాజుగారి అనుమతితో, సేనాపతి పర్యవేక్షణ కింద కత్తిసాము నేర్చుకుని, అందులో కూడా అద్భుతమైన చాకచక్యం సంపాదించాడు.

ఇంతలో దేశం సరిహద్దున ఆటవికులు పితూరీ లేపటం వల్ల, వారితో యుద్ధం అవసరమయింది. సేనాపతి సోమశేఖరుణ్ణి తన వెంట, పితూరీ అణచటానికి తీసుకుపోయాడు. అంతదాకా సోమశేఖరుడు యుద్ధం ముఖం ఎరగడు.

ఈ యుద్ధంలో రెండు వైపులా మనుషులు నరకబడి, రక్తం ఓడుతూ చావటం చూడగానే సోమశేఖరుడు మూర్ఛపోయాడు.

—లక్ష్మి జోగి

★ ★ ★

పై కథకు మంచి పేరు ఆలోచించి ఒక కార్డు మీద మాత్రమే, మీ చిరునామాతోపాటు రాసి, "కథా శీర్షిక పోటీ", చందమామ, 2&3 ఆర్కాట్ రోడ్డు, వడపళని, మద్రాసు 600 026 అన్న చిరునామాకు పంపండి. కవర్లు వగైరా పరిశీలించబడవు.

కార్డులు మాకు అక్టోబరు 20 లోగా చేరాలి. అందులో ఫోటోవ్యాఖ్యలు చేర్చరాదు. ఫలితాలు, '77 డిసెంబరు చందమామలో ప్రకటించబడును.

---

ఆగస్టు నెల పోటీ ఫలితం: పక్షపాతానికి, దక్షత బురఖా!

గెలుపొందిన వారి పేరు: ఎ. సర్వేశ్వరరెడ్డి, జడ్చర్ల, మహబూబ్‌నగర్ జిల్లా.

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 25 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1977 డిశెంబర్ నెల సంచికలో ప్రకటింపబడును.







D. N. Shirke

A. L. Syed

★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్కమాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.)

★ అక్టోబర్ నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 25/–లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని ఇతర విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి :—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—**26.**

---

## ఆగస్టు నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : పదుగురాడు ఆట

రెండవ ఫోటో : పరమశివుని ఆట

పంపినవారు: సి. యస్. ఆర్. ఆంజనేయులు, బండిమెట్ట, సికింద్రాబాదు.

బహుమతి మొత్తం రు. 25/—ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.




# అమృతాంజన్ లిమిటెడ్‌వారి విశిష్టమైన

# ఆముదము

శుద్ధిచేసినది.
వాసనలేనిది.




మూడు
సైజులలో
లభిస్తుంది:
50 మిలి
100 మిలి
200 మిలి

అమృతాంజన్ ఆముదము

OBM 3270/3 TG (R)

# ఒక్క ఓడోమాస్ మాత్రమే ఖచ్చితంగా దోమలబారినుండి 2 విధాలుగా కాపాడుతుంది...

## మీరు రాత్రంతా హాయిగా నిద్రపోయేందుకు తోడ్పడుతుంది.

ఓడోమాస్ మరే యితర దోమల నివారిణి సమకూర్చని రీతిలో రక్షణ సమకూరుస్తుంది:

1



దీని వాసన దోమలను దూరంగా ఉంచుతుంది.

2



దీనిలోగల ప్రత్యేకమైన మూలపదార్థం దోమల బారి నుండి మీ చర్మాన్ని కవచంగా కాపాడుతుంది...రాత్రంతా.

ఇక, ఓడోమాస్ భారతదేశంలో అత్యధికంగా అమ్మబడుతున్న దోమల నివారిణి అంటే ఆశ్చర్యమేముంటుంది మరి!

దోమల బాధకు గురికాకండి—

# ఓడోమాస్

అందుబాటులో ఉంచుకోండి!




మచ్ఛర్
కా
దుశ్మన్

3 బల్సారా
—సౌఖ్యమైన జీవనానికి

MAITRA-B.S.86 TEL

everest/929/PP-tl

# పార్లే క్రాక్‌జాక్ నాట్యం

"సరిగా...గా..గా ఉప్పప్పగా"

విడిగా అమ్మబడవు— అనుకరణలుంటాయి... జాగ్రత్త!




తియ్యగా ఉప్పగా ఆ రుచి ఎంతో హాయ్ హాయ్
క్రాక్‌జాక్‌తో మజాగా కొట్టండి ఇకపై జై జై




